

# శ్రీ వెంకటేశ్వర శతకములు

నర్సారావుపేటతాలూకా కుంకులకుంట పురవాస్తవ్యులు

రాళ్లబండి అప్పలరాజుగారి తనూభవుండగు

రామరాజకవిచే రచియింపఁబడి

నైజాంయిలాకా వరంగల్ జిల్లా కంమ్మంమెట్టుతాలూకా

శీతారాంపురం గ్రామకాపురస్తులు తాతా, సత్యనారాయణ

శీతారామయ్యగార్ల ద్రవ్యసహాయముచే

లక్ష్మి ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి

ప్రచురింపబడియె

నర్సారావుపేట

మొదటికూర్పు 600

1937

# కృతిపతి వంశావళి

---

ఉ॥ శ్రీయమురాదిరేని నుతశీలుఁడు ♦ భక్తజనావనుండు నా
[illegible]జగద్భృదుత్తముఁ డధోక్షజు ♦ డార్యనుతుండు యోగిహృ
ద్గేయుఁడు వేంకటేశ్వరుఁడు ♦ ధీజనపోషుఁడు తాత సత్యనా
రాయణగారికిన్ విభవ ♦ రాజినొసంగు సదాముదంబునన్॥

శా॥ శ్రీవాణీశుఁడు యిందిరాధరుఁడు సుశ్రీశైలజా నాథుఁడున్
భావంబందున సంతసించి సతమున్ భాగ్యంబు నాయుష్య స
త్సేవారోగ్యములన్ నొసంగియును బల్ క్షేమాభ్యుదయన్ జేయు తా
తావంశాబ్ధి విధుండనన్ బరఁగు సీతారామయాఖ్యున్ దగన్

సీ॥ శ్రీరమానాసటికి చెర్పుకెక్కనైజాము ♦ లోవరంగలుజిల్లా శివిదనరె
ఆజిల్లా మెడరత్నహారమైకంభము ♦ మెట్టుతాలూకాకుపట్టుసిరికి
గలుగురెండామడతిలకింపగాతూర్పు ♦ భాగమందునఁజూడఁపతిముదనర
వర[illegible]తారామపురమునవర్ణింపను ♦ అలఫణీంద్రునకైనయలవియగునె
గీ॥ వనములునుకూపతతియు ♦ సువర్ణమహిమ ।నలరిచెలువారె
గృహములుసమ్భృతముగ ♦ సంగతోఁబుట్టినటువంటి కమ్మవారు
కాపురంబుండి కేప్రొద్దుదీపితముగ॥

సీ॥ ఆకమ్మవారిలో యతిదానశీలురై ♦ ఖ్యాతిగాంచినవారు తాతవారు
జలనిధులింకిన పలికిబొంకనివారు ♦ దైవ పారాయణుల్ తాతవారు
తీర్థయాత్రలనెల్ల తిరిగిపుణ్యముచేత ♦ దనరివర్తించిరి తాతవారు
దేవబ్రాహ్మణభక్తి సేవానురక్తులు ♦ ధారణీస్థలియందుతాతవారు
గీ॥ విత్తమునుసత్యమునుధర్మవితతిచేత ♦ భాసురంబుగసత్కీర్తి
ప్రబలిదిశల। వన్నెకెక్కిరి సత్కులవర్తనమున ♦ ఈతముక్కల
గోత్రులు భూతలమున॥

క॥ ఆవంశమునందు లక్ష్మయ్య ♦ పావనుఁడై గల్గి సుకవిపండిత తతిచే
కేవలముగ మెప్పొందియు। భావజ్ఞులు మెచ్చకీర్తి బడసెడా యెధరన్

సీ॥ భావింపగా మేనుంపల్లి శేషయ్యకు ♦ సీతమ్మకును ముద్దుకూతురైన
పతిహితమైన సుబ్బమ్మను లక్ష్మయ్య ♦ వరియించె పత్నిగా వాంఛలలర
లక్ష్మీకటాక్ష సంరక్షణుడై దేవి ♦ దేవర బోలియు భావమలర
పరమేశ్వరునిఁ గూర్చి భక్తియుక్తంబుగా ♦ వ్రతమాచరింపసత్సుతుఁడుఁ గల్గె

గీ॥ ధరను కర్ణుని శిబి బలి దానములను ♦ మించి సామ్రాజ్యవిభవమ్మున
మేటిసుగుణుఁడయ్యె సత్యముఁ దప్పక యనవరతము ♦ హనుమయా
ఖ్యుఁడుఁ జరియించె యవనియందు॥

సీ॥ విత్తమున్నదటంచు విఱ్ఱవీగఁగఁ బోఁడు ♦ యాచించువారలఁ ద్రోచెఁ
గాని। చక్కఁగా తనకున్న సౌఖ్యమెంచడుగాని ♦ మించి దీనుల నాదరిం
చెఁగాని। కష్టముల్ వచ్చిన కల్లలాడడుఁగాని ♦ సత్యవ్రతంబులు సల్పఁ
బోని। పరులసొమ్ములయందు భ్రాంతిఁ జెందడుఁగాని ♦ పరవుపకారి
యైఁ బరగుఁ గాని

గీ॥ కమ్మవారిలో సత్కీర్తిఁ గాంచి మంచి ♦ వాడటంచును నుతికెక్కె
వసుధయందు ♦ తాతవంశాబ్ధిసోముఁడై ధర్మమూర్తి। యయ్యె వర్తిం
చె హనుమయ్య సయ్యనంగ॥

గీ॥ మానితంబుగ వల్లభనేని వెంక। యాఖ్యునకు చంద్రమాంబకు యధి
క ప్రీతి। కూతురైనట్టి నాగమ్మ గుణకదంబ పట్టుదలగ వరించెను
మెట్టులనగ॥

చ॥ కనుగొనమందు శంకరుడు కాళిని యబ్జభవుండు వాక్సతిన్
వనజదళాక్షుఁడున్ రమను వాసిగ పెండిలి యాడురీతి స
జ్జననుత నాగమాంబను ప్రసాదముగా వరియించె మంచిగా
హనుమయ తాను సర్వసుజనాళి నుతింపగ యుద్ధరాస్థలిన్॥

చ॥ వరుసగ నాగమాంబను వివాహము నాడిన నాటనుండి తా
సిరియును గోగణంబు కడుక్షేత్రము వృద్ధిని జెందెనంచు
భూవరులును పండితోత్తములు వర్ణనజేయుచు నుందురా భళా
అరయగ హన్మమయాఖ్యునిల హర్నిశమున్ మది సంతసంబునన్॥

సీ॥ భూమిజామనువు శ్రీరాముని పెండ్లాడి ♦ సత్కీర్తి జెందిన సరణిగాను
సత్యవంతునకును సావిత్రి ♦ కడుభక్తి చేతసటించిన రీతిగాను
అత్రిమహామునిన్ అనుసూయ ప్రేమించి ♦ పరిచర్య జేసినపగిదిగాను
చంద్రమతీ హరిశ్చంద్రునకనురక్తి ♦ జూపినటించు నస్తోకగతిని

గీ॥ పతిని దైవంబటంచు సమ్మతి జెలంగి పుట్టినింటికి కాలును
మెట్టినింటికి అధిక పేరును దెచ్చె ♦ గుణావలాంబ భవ్యగుణపేటి నాగ
మాంబావధూటి॥

ఉ॥ దోసిలినొగ్గి మొక్కియు వధూవరులిర్వురు భక్తిచేత వి
శ్వాసమెలర్ప రుక్మమయ కాసలు గూర్చి నిరంతరంబులన్
భాసుర మొప్ప పూజను శుభావహ మొప్పగ జేసినంతనే
కాసులు రత్నముల్ మణులు గ్రాలెటి సంతతి నిచ్చె రాముడున్॥

ఉ॥ మారసమానమూర్తులసమాన పరాక్రములున్ మహో
దారులు సత్యవంతులునుదాత్తమతుల్ సుజనాభిరాములున్
భూరియశప్రభూతులును పుత్రులు ముగ్గురునుద్భవించిరా
ధారణి హనుమయాఖ్యునకు దారపతివ్రత నాగమాంబకున్

గీ॥ పెద్దకొమరుండు లక్ష్మయ్య పెన్నిధాన। మునగ నలిగియు కొన్నాళ్లు
జగతియందు। మంచి సుగుణుండు జూడయటంచు కీర్తి। గాంచి స్వ
ర్లోకమున కేగెఘనులు దలప॥

సీ॥ బాయడుతలిదండ్రిభక్తి యల్లప్పుడు ♦ సత్యనారాయణ సరసులెన్న
ధర్మపరుండు సీతారామయాఖ్యుండు ♦ అన్నమాటల కెదురాడకుండు
యిరువురవాక్యముల్ యేకమైవ్రవహించు ధర్మంబునందునా దాయమందు
వారి వర్తనములు వర్ణింపతరమా న ♦ ఫణిరాజునకు పద్మభవునకైన

గీ॥ తల్లిదండ్రులుజేసిన తపము వలనొ। గానవారలుగల్గు సత్పుత్రఫలము
యిట్టిసుగుణంబు సత్యంబు యిట్టిధర్మ। మెట్టులను సంభవమునొందు
యేరికైన॥

గీ॥ సిరితోబుట్టి పతిహితల్ నారిమణులు। చంద్రమాంబ శుభద్రమ్మ
శాంతమయును। గుణవతియనంగ చుక్కమ్మ కోరికలర। సోదరు
లకెల్ల మానసామోదమంద॥

ఉ॥ బ్రాయడు సర్వధర్మములు బ్రాయడు సత్కవి పండితార్థులన్
బ్రాయడు సత్యవాక్యమును బ్రాయడు శ్రీహరిభక్తి నిత్యమున్
బ్రాయడు భూసురోత్తముల బ్రాయడు ధైర్యము తాత సత్య నా
రాయణయంచు ఫాలమున వ్రాసెనుధాత ప్రమోదమందియున్॥

సీ॥ వల్లభనేని సద్వర్ధిష్ణుడైనట్టి ♦ గుర్వయ్య యాదెమ్మ కూతురైన
సుగుణంబులకు రాశి జూడగాసావిత్రి ♦ హాజయప్రదలనయ్యబ్బురం బె
తోయజాక్షిన సక్కుబాయికీడగుభక్తిం ♦ గలదనికనకమ్మగణనజెంది
మేనత్తకొడుకుకై మేనెత్తివరియించె ♦ నారాయణాఖ్యునికోరికలర

గీ॥ భావజుండునుయారతీదేవింబోలి। కాపురముంజేయ శ్రీహరికరుణవలనం
గలిగె సంతానమును కోరికలుఘటింప। రత్నములమించు తనయు
లు రాజితముగ॥

గీ॥ రామచంద్రుండు సీతాభిరాట్టి సుతుల। వలెను హనుమయ్య తోడ
ను వాసిదనర। రాజిదాకారుడానంద రాములరయ। తల్లిదండ్రుల
కోర్కెలుద్ధతినిదీర॥

గీ॥ మేల్మిబంగారు బొమ్మల మించినట్టి। ముద్దుకూతుండ్లు గలిగిరి మో
దమలర। సోమునిరసించు హాస్యనుసూయమాంబ। తోడ వెంకట
శేషమ్మ వేడుకలర॥

కం॥ తాతా వంశమునందున । సీతారామయ్యగలిగి క్షేమకరుండై
భూతలమునందు సత్కవివ్రాతములను బ్రోచుటకునువాసికెలంగ॥

గీ॥ తనదుతో బుట్టు చంద్రమ్మ మధవుడు యడవకులుడు వేంకటరామయ్య
కూతురైన । రామభాయమ్మ తనవధూరత్నమయ్యె
ప్రేమద మెన సంగబంధు జాలములు మెచ్చ॥

సీ॥ వేడ్కతో యడవ శ్రీ వేంకటరామయ్య భార్యయై
చంద్రమ్మ పరిడవిల్లె । వేడ్క వల్లభనేని వెంకటప్పయ్యకు
పరికింప భద్రమ్మ పడతియయ్యె । మానితంబుగను
కొర్నేని శ్రీ బుచ్చిపాపయ శాంతమాంబకు భర్తయయ్యె ।
బండి వెంకయ ముద్దుభార్యయై చుక్కమ్మ సత్కీర్తి జెందిన
సాధ్వియందు॥

గీ॥ యిట్టి పతులకు సతులకు యెన్నికలర । వెంకటేశుండు యెప్పుడు
విమలమతుల । ధనము ధాన్యంబు పశుపుత్ర తతిని సంగి
చక్కగా నేలుచుండును సంతసంబు॥

గీ॥ సత్యనారాయణుడ కనుజన్ముడైన । సీతరామయ ననుగాంచి
ఖ్యాతిదనర । తిరుపతి వెంకటేశ్వర దేవుపేర । శతకములువ్రాయు
కవివర మతిజెలంగ॥

గీ॥ అనిన సరెనని నియమంబు లందముగను । సీసములు వృత్తములు
గూర్చి భాసురముగ । శతకములు రెండువ్రాసితి సత్కవీంద్ర
తతియు తలలూచ వారల తలపుదీర॥

గీ॥ కణగి తిరువాయిపాటి వెంకయ సహాయ । మునను ప్రాప్తించె
శతకముల్ మోదమలర । యనుచువినుతింతు మిక్కిలి యనవరతము
పుణ్యవశమున రాముడు బ్రోచుగాత॥

# శ్రీ తిరుపతి వెంకటేశ్వర శతకము

---

సీ॥ శ్రీరమణీమణి చిత్తపద్మ దినేశ। కుటిలమానస శత్రుకుల వినాశ
పక్షిరాట్ద్వాహన బంభర సమకేశ। యాదిత్యలలిత సహస్రప్రకాశ
వందితామర భక్తపాల హృషీకేశ। ఖలజనావళిజీవ కాలపాశ
శ్రీకరంబుగనన్ను చేపట్టు లోకేశ। పావనమ్మునుగాత్రి భవవినాశ
గీ॥ ధనమునిమ్మనినిన్ను గోరనుదురాశ
త్వరగనను బ్రోవు శ్రీహరి స్వప్నకాశ
ధీరుడౌ సత్యనారాయణ ధీనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 1

సీ॥ శ్రీకరగౌరీశ పాకారిముఖనుత। విప్రాళిపూజిత విమలచరిత
పండితజనకృత పాపమండనహిత। వరమిమ్ము నన్మునివర్గ విహిత
సామజవరద సుజ్ఞానసందీపిత। నళినాప్త కుముదాప్త నయనధరిత
హితభక్తదీన కపీశ్వర పోషిత। ధృతమతివర వసుదేవ జనిత
గీ॥ నిక్కముగ నన్ను బ్రోచుటే నీదుఘనత
పర్వతాగ్రంబె నికెప్పు పరమవసత
సీతరామయ్య సుగుణహృత్స్థిర నివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 2

సీ॥ వర్ణితసద్గుణ వైభవ సూత్రామ। నళిననిభేక్షు జనాభిరామ
శూలివాగ్వ గసురసేవితామలసీమ। పూషకులాంబుధి పూర్ణసోమ
కవిజనావళిచిత్ర కదనశాత్రవభీమ। గురుబుధవంద్య వైకుంఠధామ
రాజితచారిత్ర రాజరాజలలామ। విప్రజనామోద విజితకామ
గీ॥ నిన్నువర్ణింతుఁజూపుము నీదుప్రేమ
సప్తగిరివాన భువనసంస్తవసునామ
నగసముద్ధృత నారాయణా హృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 3

సీ॥ కనకాద్రిసమధీర కందర్పసమరూప । గానప్రవీణ సత్యానులాప
సన్నుతామరగాత్ర శంశరాకరరోప । రమణీయవేష సూర్యప్రతాప
కారుణ్యసాగర ఖండనశివచాప । సామజవరద యశఃకలాప
ద్విజనావనదేవ దివ్యమాలిక్లేప । పాపసందోహాబ్రి పవనరూప

గీ॥ రత్నమణిమయహార ధర్మాదిదీప
రాజరాజేశ్వరుండవు రామభూప
సీతరామయ సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 4

సీ॥ శ్రీరమాధవనీదు సేవనిత్యముఁదప్ప । నిఖిలవేల్పులయందునీవెగొప్ప
చక్కఁగానీనామస్మరణ సంపదకుప్ప । ముద్దుగానీగీము పెద్దతిప్ప
గాంగేయవసన నీశృంగారమును జెప్ప । వేయకఁజూతు నేవేఁడుకొప్ప
మంచిగానీనోటి మాటయేరికిఁదిప్ప । జాలరుపండితజాలముప్ప

గీ॥ తిలగరచియించితిని కృతిఫలితమొప్ప
ప్రేమచేతను కడతేర్చవేమితప్ప
నవ్యతరభావ నారాయణాహృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 5

సీ॥ ధర్మవర్తనుడయ్యు ధారుణినీతాత । యధికసద్యశముచేయలరెగాత
నీచక్రిమును బెట్టి నిఖిలశత్రులఖాత । అప్రమేయుండగు హరుసమేత
సివధూరత్నము నెరిజీవులకుమాత । సుతుడయ్యెనుతికెక్కఁజూడధాత
నీకథల్ గానివి నేరచించుటరోత । నిర్జరాధిపుడయ్యెనీకుఁభ్రాత

గీ॥ నమ్మియుంటినెఁగావవు నాదుగీత
వందనంబులు గైకొన వెందుచేత
సీతరామయ సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 6

సీ॥ వామనావతార శ్రీవైకుంఠపురవాస । స్థిరభక్తజనహృది చిద్విలాస
మందరగిరిధీర మానితదరహాస । పొలుపుగాదీప్తితి బుధులతోస
రాజీవనయన నిరామయురవిభాస । వాసవాశ్చితపోష వారదాస
అలివేలుమంగమాంబామణి వుల్లాస । మణిగణహార సద్గుణవిలాస
గీ॥ శ్రీకరంబుగనన్నేలు సింహారోస
దీనపోషణ నన్గని దీర్చుయాస
నగసమధృత నారాయణాహృదీశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 7

సీ॥ దానసీలుండు సీతారామపురమున । వలనొప్పగనుకమ్మవారిలోన
తాతవంశాబ్ధి సుధాకరుండనధన । వంతుండుహన్మయ్యకాంతయైన
పతిహితనాగమాంబగర్భమందున । జన్మించి కీర్తిచేజరుగబడిన
నూరమూర్తులుసత్యనారాయణాఖ్యున। కనుజుండుసీతరామాభిదుండు
గీ॥ మరువకనునీసుభక్తియు మానసమున
పద్యశతకము నీపేరపతిమదనర
అంకితంబును నిడిచ్రాయు మనగనేను
వేడుకలరంగ వ్రాసితి వెంకటేశ. 8

సీ॥ క్షీరాబ్ధిశయనరాజీవసన్నిభనేత్ర నవవవానలసుజన వారస్తోత్ర
రాజరాజేశ్వరరంజితామలగాత్ర । వివిధపండితకవివినుతపాత్ర
త్రిభువనాధారగౌరీవంద్యచారిత్ర । సత్యవ్రతాచారసవ్వర్ణనేత్ర
కరివశాత్రవగర్వఖండనకరపత్ర । భక్తజానానందభానుగోత్ర
గీ॥ పాకరిపుభోగబ్రోవు రమాకళత్ర
దానజవసంఘ కలుషలతాలవిత్ర
సీతరామయహృదయ సుస్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ. 9

సీ॥ పాలసంద్రమె నీకు పరికింపఁ గా యిల్లు- జలజాక్షు నా పాపములను గిల్లు
గొప్పగా నీకతల్ తప్పక రాజిల్లు విరచితవో నా మహాముని యిల్లు
నిన్నుఁ దల్వని వారి పున్నత మావెల్లు పరికింపఁగను పాడుఁ బడిన కొల్లు
నీ యన్న ద్రాగెను నేశైన రుచికల్లుఁబడదన్నతివి ముందు బండిఁగల్లు
గీ॥ శ్రీకరంబగు సిరులివ్వ నీకె చెల్లు-
దనుజవర్గంబు నిర్గ్నని తల్లడిల్లు-
శీతరామయ్య సుగుణహృస్థిరని వేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 10

సీ॥ అల్లరిఁబడితివి గొల్లచెలులవల్ల- కణగి నేలితివి లోకములనెల్ల
సిలాబ్రిమును గేరుని శరీరంబెల్ల చాల ప్రబలితి జేజేలవల్ల
సేవించితిని నాదు చిత్తమురంజిల్లఁ బాపవె నాదు పాపములనెల్ల
నిఖల బ్రహ్మాండంబు నిండెను నీడొల్ల తరిగితో పగతులతలలుడుల్ల
గీ॥ చక్రగా బ్రోవునామది సంతసిల్ల-
దనుజులెరుగరె నీను వృద్ధుఁడమెల్ల
నవ్యతర భావ నారాయణహృదీశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 11

సీ॥ అస్థిరంబని దేహమది దెల్య నేరక మంచిగా నిను స్మరియింప లేక
పాపకార్యంబులఁ బహు పోగు జేసుక పత్నీసుతులయందు భ్రమనవదలక
నిర్వికారుండ నినిన్ను నెరుంగక - కడతేరు కెట్లు దుర్గతిని బడక
శాశ్వతంబైనట్టి స్వర్గంబుఁబడయక నిర్ణిమిత్తంబుగ నీ బ్గెదరిక
గీ॥ పాలబడితిని నేలు భూపాలతిలక-
నేరమెన్నకు నాపైన మారజనక
నవ్యతర భావనారాయణా హృదీశ-
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 12

సీ॥ సూరిజనహృదయసారసదళమిత్ర। సుందరానన యరవింద నేత్ర
సారససంభవ శంకరాదిస్తోత్ర । నిఖిల లోకాధారనీలగాత్రి
పండరీపురవాస భండనరిపుజైత్ర । తవభక్త పాప లతాలవిత్ర
ఖండన శివచాప ఖరకరసద్గోత్రి । పాకారివందిత భూకళత్ర
గీ॥ రమ్యచారిత్ర దశరథరాజపుత్ర
మనవిచేకొని సన్నేలు కనకనేత్ర ।
నవ్యతరభావ నారాయణాహృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 13

సీ। తవనామమధుర సుధారసంబును । గ్రోలిసంతసించితిభక్తజనులపాలి
దేవుండవనుచు నుతించితి వనమాలి । భక్తుడంచును జెందఁబడవుజాలి
వనదశరీరి సేవాఁడి ముల్కినఁగూలి। నిష్ఠురోక్తులుఁబల్కఁ నిన్నువాలి
బాలుడంచునువచ్చిఁబడిసిగ్గెపెనుగాలి ।తనయుడైనుతికెక్కఁతమ్మిమాలి
గీ॥ పద్యములుఁజెప్పితిని నేనుపనికిమాలి
దయనుఁజూఁడుముమరువకధర్మశాలి
శీతరామయ్య సుగుణహృస్థితనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 14

సీ॥ కలకాలమిట్టుల కష్టముల్ బడజాల । మన్నించునన్ను భర్మాభచేల
వైరివర్గాట వివహ్నివిగోపాల । ప్రధిత సద్విభుధాళి భావలోల
కరుణాంతరంగ శ్రీ కాకుత్సకులసీల । గానధురీణ దాసానుకూల
మానితాచార శ్రీ మంజులవాగ్జాల । వందితాఖిలకృష్ణనందబాల
గీ॥ పండరీపురనిలయ వేదండపాల
సచ్చిదానందదయఁజూపు జాగులేల
నవ్యతర భావనారాయణా హృదీశ-
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 15

సీ॥ వలనొప్పఁగట్టితౌ వారాసిఁగోరోడ్డు । నెరివాలిఁబట్టెను నీకుసాడ్డు
నిఖిలజగంబుల నిర్మించెఁజెబొడ్డు । తనకుమారుఁడు దేవతలకు హేడ్డు
బాయకునీభక్తిఁజేయుక యేహడ్డు । రహినిచ్చుఁదల్పవిరసన తెడ్డు
పచ్చగానినుఁదల్పకున్ననుశోకగొడ్డు । పాపసూపంబుఁగొఁబడితివడ్డు

గీ॥ తిన్నఁగాఁజేర్చుకుంటివి వెన్నజడ్డు
మ్రింగితివి ముంనువినునుఁడేమచ్చెనుడ్డు
శీతరామయ్య సుగుణహృత్స్థితనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 16

సీ॥ నిగమార్గసంచారనిఖిలభక్తాధార । నిర్జరానందశ్రీనిర్విచార
కంజాతనేత్రనిర్గాంచితిఁకనులార । బుధజనావనదశరథకుమార
భూపాలపాలనిర్ణమ్మపూజింతు మనసార । కడుశుభంబులనిచ్చిగావవేర
కరిరాజరక్ష శ్రీకరభక్తమందార । శ్రీరమాహృదయరాజీవసూర

గీ॥ మనవిచేకొను రాక్షసమదవిదార
పరమపావన పండరపురవిహార
సన్నుతిర భావనారాయణా హృదీశ-
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 17

సీ॥ స్మరణపరూప భాసురభక్తమందార । దేవకీతనయ యశోవిహార
వాగ్దేవిశైలజా వర్ణితయాచార । లాలిత్యనంత నీలాభ్రకార
పాపాబ్ధి సందోహ పవనసత్యవిచార । శ్రీరుక్మిణీమణిచిత్తచోర
లోకత్రయంబులసాధిగామనసార । రక్షించితివిదశరథకుమార

గీ॥ వనజలోచన శత్రుకాననకుఠార
ఆదరింపుముదేవ మీయాజ్ఞమీర
సీతరామయ్య సుగుణహృత్స్థిర నివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 18

సీ॥ కరమందునీవుచక్రాయుధంబు । ధరించిబలసినరిపుకోటితలలుద్రుంచి
భావంబునలరసుగ్రీవునిరక్షించి । అలయింద్రజునిప్రాణమపహరించి
వనచరాళినిఁగూర్చి వారధిబంధించి । ఘనతలంకాపురిఁ గనులగాంచి
కిన్కఁబూనియుదశగ్రీవునివధియించి । చింతనువిడనాడి సంతసించి

గీ॥ సీతతోఁడనయోధ్యకుఁ జేరిమించి
కరుణతోఁడను నేలుసికనులగాంచి
నవ్యతరభావ నారాయణాహ్వాదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 19

సీ॥ భవసాగరంబునఁబడియీదనేరక । స్తుతియించిసాడ దుర్మతినిగనక
నిర్భాగ్యుడేదూరుసిమహాత్తిరుగకఁ । దప్పుదుశమనుసిఁదాపుజనక
వినుతించిచినినాదుమనసునొప్పించక । పాలించుమయ్యభూపాలతిలక
మనువంశమునబుట్టితినుచుగర్వించక । మోహనాకార నేముద్దుగులుక

గీ॥ శతకమొక్కటివ్రాసితి శ్రమనుఁబడక
మరచిపోకనునన్నేలు మదనజనక
స్థితిరామయహ్వాదయ సుస్థిరసివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ. 20

సీ॥ సిరుకుగా నీయింతి నిలయమే పద్మంబు । కరినులజంపెసిఘునశరంబు
దశరథక్ష్మాపాలతనయ నిదానంబు । పుడమిదీనులకెల్ల కడుధనంబు
పొలుపుగా నీచతుర్భుజముల సత్వంబు । ఎరుగికనిపిల్లరి యరిగణంబు
నీపాదములయందు నిల్పినేచిత్తంబు । దప్పకఁజేతు సత్యవ్రతంబు

గీ॥ నిక్కముగనన్ను బ్రోచుటే నీనిజంబు
అరయనీచర్య లెన్నయత్యద్భుతంబు
నవ్యతరభావ నారాయణాహ్వాదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 21

శీ॥ భువిమోహనాకారపుండరీకదళాక్ష । దయతోడ నాకిమ్ము ధర్మభిక్ష
పరిపంథులనుజంపబట్టితివటదీక్ష । ఖ్యాతిగాంచిన ధర్మసూతిపక్ష
కురువంశమంతయుఁగూలార్చుటకు కక్షఁ। బానితివలనాఁడు భువనరక్ష
స్థిరముగాపద్యముల్ జేసియువకలక్ష । కృతినిత్తునీపేరకృపనుమోక్ష

గీ॥ పదవినోసగుము సత్వరకదనదక్ష
అవ్యయానంద శ్రీకరుణాకటాక్ష
సీతరామయ సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 22

సీ॥ కోమలోప్పపద్యముల్ గూర్చియు। పూదండవలె వేతు వేగనీగళమునిండ
నీకుమారుండన్నలోకంబులకు। గుండకరుణతోఁజూడు నీకనులనిండ
దశవేషములచేత దనరినమార్తాండ । వంశప్రతాప సద్వాక్యశౌండ
సిరులిత్తువని నేనుఁజేరితినీయండ। రమణతో నిడుఖగరాజకాండ

గీ॥ కమల జాండోదయుడవులోకములునిండఁ
జెప్పుచుందురు పండితుల్ దప్పకుండ
నవ్యతరభావ నారాయణహృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 23

సీ॥ గోవర్ధనోద్ధృతకుండలీజశయన । కఠినరాక్షసవారగర్వశమన
వర్ణితనిర్జరవారణేంద్రావన । రంజితామలకాయకంజనయన
భానుసంకాశసత్పక్షిరాడ్వాహన। యిందిరాహృదయారవిందసదన
భవముఖామరనుత పాలితమునిజన । పాపసందోహాబ్ధిపవనసుమన

గీ॥ మణిగణాలంకృతాహార మధురవచన
సాంద్రసదృశ పూర్ణిమాచంద్రవదన
సీతరామయ్య సుగుణహృత్స్థిర నివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 24

సీ॥ బ్రస్తుతించితినని వరములివ్వమినాకు ♦ చెండాడెరిపులనీ చేతిబాకు
గొల్లభామల చీరలెల్ల నెత్తుకమ్రాకు ♦ పైనగూర్చుండుటపరువనీకు
సిరజాక్షులముంచె సిప్పుఁజేసినపోకు ♦ యిపుడునన్నేలక యెందుబోకు
ఘనసమమూర్తింత కఠినిమానిగబోకు ♦ లేమువేల్పులకునునీదుకీకు

గీ॥ దనుజమర్దన నన్నునీదయనుసాకు
నాకుజాతుఁడు కృతినిచ్చె నేరనీకు
నవ్యతరభావ నారాయణాహృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 25

సీ॥ శేషశాయివటంచు భూషించితిని ప్రీతి ♦ గానన్నునేలినగల్గుఖ్యాతి
కల్పశాఖనిమించె గనుఁగొననీసాటి ♦ మెప్పుగాగోరెనిక చుప్పనాతి
ధర్మవర్తనుడనిఁదలతురు మునిజాతి ♦ నీపదంబునగల్గనింగినాతి
పరిపంథిజనులకుఁభయమునీచేహేతిఁ వాహ్వానమ్మెనబంటువాయుసూతి

గీ॥ మొక్కి మొక్కియు యింతకుమోసపోతి
యెట్టులనుదూరిననుగాని యేలనైతి
సీతరామయహృదయ సుస్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ. 26

సీ॥ కారుణ్యశరధి నిష్కామ బంగరుచేల ♦ సారసనయనదాసానుకూల
సంతతసజ్జన సాధుసజ్జనజాల ♦ గోపాలకృష్ణ సద్గోత్రసీల
దుర్మార్గవైరి సందోహబ్రివాతూల ♦ హరిజితశౌర్య గుణాలవాల
యాహవరిపుజనాంతర్గత యాభీల ♦ క్షితిగోపికలకు జూపితివిలీల

గీ॥ కోరినీపేర పద్యముల్ కుసుమమాల
గారచించితినన్నేలు గానలోల
నవ్యతరభావనారాయణా హృదీశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 27

సీ॥ తనువునిత్యంబనిధనముసంపాదించి ♦ దానము శాంతము తాత్యజించి
పెద్దలగురువుల ప్రియము చేనిందించి ♦ ఎలమిబీదలఁగని మొక్కరించి
తల్లిదండ్రులపైన తప్పులుగావించి ♦ అన్యులధనమెల్ల నపహరించి
దుర్మార్గులనుఁజేరి దుడ్కులుగావించి ♦ చెడుకార్యములయందుచిత్తముంచి

గీ॥ కడకునరకంబునఁబడి కడుకృశించి
సద్గతిఁ జెందరైరి నిఁ సంస్మరించి
శీతరామయ్య సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 28

సీ॥ పరమేశసాంగత్య పరికింపనీమాట ♦ అసదృశంబైనట్టి పసిడిమూట
కన్నతండ్రివటంచుయెన్నదముపూప్పాట ♦ లోకమందెవ్వరునీకుపూట
నిశ్చలభక్తిచే నీమాటజవదాట ♦ నెరినాకువరమివ్వ నీకులోట
నివధూమణిఁజూడనిల్వదుయెచ్చోట ♦ మునుకొనినీసేస్తుతే ముక్తిబాట

గీ॥ వేడుకలరఁగ నేసత్కవీంద్రునోట
మానజాలను సతతమునీపైనిపాట
సవ్యేతరభావ నారాయణాహృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 29

సీ॥ రాజరాజేశ్వర రమణీయతరవేష ♦ శోభనాకార సత్యాభిలాష
భానుసంకాశసత్పక్షిరాజసమభాష ♦ ఇందిరాహృదయారవిందపూష
నారదవిభుధవనాటాదిసత్తోష ♦ నందితామర మదవైరిశోష
సంతతానంద యనంతరత్నవిభూష ♦ సింధుగంభీర భాసితమనీష

గీ॥ పార్వతీనుతచారిత్రి నిర్విశేష
చిత్రభానుకులోద్భవ సింహరోష
సీతరామయ్య సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 30

సీ॥ మనవిఁ జేకొనుమయ్య దినమణిసమ తేజ ♦ వరముని సేవితపద సరోజ
సుజనసంరక్షణ సుందరరతిరాజ ♦ కవిబుధసంచయ కల్పభూజ
వనజాయతాక్ష సద్వైభవసురరాజ ♦ స్థిరయశఃకామ లక్ష్మీమనోజ
పరమభక్తిగఁ జేతు మరువక నీపూజ ♦ రంజితసద్ధనరాజరాజ
గీ॥ ధీజనానందవరద మత్తేభరాజ
సుగుణవందిత సంతత సురసమాజ
నవ్యతరభావ నారాయణహృదీశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 31

సీ॥ కనకాద్రిసమధీర కనుఁగొనఁ నీవంటి ♦ వేల్పు లేడనుచు నేవేడుచుంటి
పటుబలసాహస ప్రౌఢికి మ్రుక్కంటి ♦ సరి రాడునన్నని సాకుమంటి
కమనీయగాత్రినీ కారుణ్యరసమంటి ♦ పరమందరేబున్నులరయ తొంటి
ధన్యునిఁ జేయుసీద యనుపాత్రుడనంటి ♦ వినుతించి వినుతించి వినుచుచుంటి
గీ॥ మానవాధిప కుత్సితమతినటంటి
వేడ్క నీపాదములుఁబట్టి విడువనంటి
సితరామ మ్యు సుగుణామ్రాస్థిర నివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 32

సీ॥ సనకసనందన సంస్తవపదజాల ♦ శోభనాకార భర్మాభచేల
చారణ కిన్నరాశ్చర్య సువాగ్జాల ♦ గానధురీణ బుధానుకూల
సామజరాట్పోష జనకజహృల్లోల ♦ మణిమయహార సమంజ
భాస్కరసమధామ భండనరిపుకాల ♦ పతకరాడ్ఘటితమానిభావఖేల
గీ॥ దేవదేవేశ శ్రీశయశోవిశాల
రహినోసంగెద గొను పద్యరత్నమాల
నవ్యతర భావనారాయణా హృదీశ-
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ। 33

సీ॥ నీదివ్యరూపంబు నేకన్నులను జూతు ♦ నీపైన పద్యముల్ నేను వ్రాతు
సంసారభ్రమలు నిస్సంశయంబుగ రోతు ♦ చెలగి నీకృపకు నే చేయిజాతు
నీపాదుకలు తలఁ మోపు చక్కఁగ మోతు ♦ నాపాపపుంజముల్ నఱికి వైతు
దయతో నన్గావ మొదాకను నేనైతు ♦ నిన్నుఁదలఁపని వాఁడనున్న పోతు

గీ॥ నరకమునకంపకో హరి నాకు భీతు
యిందిరానాథ నాతప్పు లెందు దాతు
సీతరామయ్య సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 34

సీ॥ కలుషాంధ భాస్కర గనుగొన నీఘాక ♦ కదిరిరిదనుజులు యాగలేక
బ్రిస్తుతించెద జనపాలక సుశ్లోక ♦ పాలించుటకు నీకు బహుపరాక
ఎరిగింపు దేవుఁడు యెవ్వరో నీవుగాక ♦ పురుషోత్తముఁడ వీవు పుణ్యలోక
చుట్టంబులా నీకు చూడ వేల్పులమూక ♦ ఇకరమ్ము నన్నేలు ఎందుబోక

గీ॥ భండనంబున పగతులు పారిపోక
నిలచెద రె చూడ గనుఁగొంను నీవు రాక
సన్వ్యతర భావ నారాయణా హృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 35

సీ॥ వైకుంఠవాసనీ వాహనం బేపక్కి ♦ యసురులు మడిసిరి యనిలో సొక్కి
శబరియంగిలిపండ్లు సంతసంబున మెక్కి ♦ కరుణించి నెగడె వెఘనసలదక్కి
జయ రామనామ దిభయ దాటపిని జిక్కి ♦ కడుచలంచితి గాని కరుణాశక్కి
యనువందగను పెండ్లియాడె నాగన లక్కి ఖరదూషణాదులుగ్రతను నొక్కి

గీ॥ కదనమున నీతోఁ బోరి రక్తంబు గ్రక్కిఁ
జావరే ముందు పగతులు చాలపొక్కి
సీతరామయ సుగుణహృత్స్థనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 36

సీ॥ పలుమారునిన్ను నేప్రార్థింతుదశవేష ♦ పావననామశుభాభిలాష
సూర్యవంశాకర సూనృతజనతోష ♦ ఇంద్రవందిత శ్రీకరీంద్రపోష
పంతమాననుబ్రోవవ్యాళశాడ్వాగ్భాష♦కమలాలయాచిత్తకమలపూష
ధనదసఖాసఖ నవరత్నభూషణ ♦ పటుఖలజనవ్రాత ప్రాణశోష
గీ॥ ద్వారకావాస యచ్యుత తల్పశేష
బీదవాడను నాలించు నాదుఘోష
సీతరామయ్య సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 42

సీ॥ దానవకులమునుఁ దప్పకహరియింప ♦ లలిగల్గితివి పెద్దలభినుతింప
మట్టిలోఁగల్పనామలమూత్రములకొంప♦ నేర్పైతినిగఁదానినుస్మరింప
కపలియిల్లుగనుండగా నీకుమదిసొంప ♦ భక్తులునీకయి పరితపింప
ప్రియబంటుకుంగరంబిచ్చిలంకకుఁబంప ♦ జనినొసంగెనుసీతసంతసింప
గీ॥ త్వరగరావయ్య నాపైన దయనునింప
విమలమతితోడ నాదుపాపములద్రుంప
సవ్యేతరభావ నారాయణాహృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 43

సీ॥ కాలయాపనమేల కడతేర్పుభూపాల ♦ పాలించుమయ్యశ్రీభర్మచేల
ఘనవేల్పుఁడనినినుఁగనుఁగొనిమునిజాల♦మునుమోక్షమందరెగుణవిశాల
పరమపావనసత్యభామ హృదిల్లోల ♦ నళినాప్తశశినేత్ర నందబాల
తిలకింపదాల్చితౌతులసిపూసలమాల ♦ నన్నేలుమయ్యభూనాధసీల
గీ॥ పదియునాలుగుయేడులు పర్ణశాల
నుండిజంపితివా లేడినొక్కకోల
సీతరామయహృదయ సుస్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ. 39

సీ॥ సకలజీవులయందుసాక్షిభూతుఁడ♦ నీవెయఖిలశాస్త్రంబులయందునీవె
అలగాచితివి భూపాలులెన్నగనీవె ♦ సుఖములొసంగు కృష్ణుండనీవే
దనుజులఁబరిమార్పతగినదేవుఁడనీవె ♦ కరిరాజునేలినదొరవునీవె
రహియర్జునునకునురథసారథివినీవె ♦ కురుసంతతకి చీడపురుగునీవె
గీ॥ భక్తజనులను రక్షింప ప్రభుడనీవె
ధాతకును తండ్రివైన బూధవుడనీవె
సీతరామయహృదయ సుస్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ. 40

సీ॥ శరణుశరణనినిన్నుస్మరణజేతుఖరాంత ♦ వివిధబుధాళిసద్విదితశాంతి
దుర్భరదుర్గుణకర్బురగణహంత ♦ భక్తాళిపాలిత భవ్యస్వాంత
గానకానినిన్నునేగోరితి నాకకాంత ♦ కారుణ్యశరధినిష్కామసుంత
కరుణఁజూపుమువైరిగణవారకల్పాంత♦ నళినాక్షబాపుమునాదుచింత
గీ॥ శ్రీరమాలోలఁ నన్ను రక్షించుమంత
మోదమలరఁగఁజేరితి నీదుచెంత
సవ్యతంభావ నారాయణహృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 41

సీ॥ నిబిడాంధకారార్కనిర్మలగుణధామ♦ అసమానశౌర్యరాక్షసవిరామ
ప్రస్తుతభార్గవిభామాంచితఃకామ ♦ ఆగమధర సుజనాభిరామ
కామసదృశరూపకమలాస్త్రసమధామ ♦ సాహభూధరపవిప్రథితనామ
దశముఖవధజగద్బంధుసత్కులసీమ ♦ కదనవైరికదంబహృదయభీమ
గీ॥ పార్వతీనుతచారిత్ర సార్వభౌమ
చక్కగానిన్నువరియించె సత్యభామ
సీతరామయ్య సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 42

సీ॥ నీలనీరదగాత్ర నిర్జరమునిసంగ ♦ పాపనిర్జితశివచాపభంగ
భాస్వరశుభధనుర్భావాది ప్రసంగ ♦ సంతతానందసుస్వాంతరంగ
బంగరుమయచేలభవతిమిరపతంగ ♦ కదనశత్రుసమూహామదవిభంగ
వివిధకాననచర విదళితసారంగ ♦ మానిత నారితనయానుషంగ
గీ॥ దేహియని వేడినాడను మోహనాంగ
హితవుగానన్ను నేలుము మతిఁజలంగ
నవ్యతరభావ నారాయణాహృదీశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 43

సీ॥ సుందరాకార శ్రీసూనృతజనరక్ష ♦ నందనందనకరుణాకటాక్ష
ఖండితశివచాప పండితజనపక్ష ♦ వందితామర ఖలవైరిదక్ష
దీనార్థికవులపైఁ బూనకుబల్కక్ష ♦ తారహారాసర సీరుహాక్ష
నార్యులపోషింతునని బూనితౌదీక్ష ♦ పక్షికిచ్చితిమునుపరమమోక్ష
గీ॥ మునుఖలాత్ములఁ జేసితిభూరిశిక్ష
చెడితినీపైన పద్యముల్ జేసి లక్ష
సీతరామయ సుగుణహృస్థినివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 44

సీ॥ మణిగణాలంకృత మంజులవాగ్భాష ♦ చతురాననాదిత్యహితమనీష
సురనదీజనక భాసురవరతరవేష ♦ కుటిలమానసదైత్య కులవిశోష
శ్రీరుక్మిణీమణీ చిత్తసారసపూష ♦ అమలమౌక్తికమణి హారభూష
కడలినిచేములిఁగనిపెట్టు పెనుఘోష ♦ దర్పకారాతి నుతాభిలాష
గీ॥ నయగుణోద్దామ భవహరశయనసేష
సదమలాచార మునిజన హృదయతోష
నవ్యతరభావనారాయణా హృదీశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 45

సీ॥ సుతుఁడైయయ్యజన్మించెహితవుగాపరమేష్టి ♦ నెరిజేసెనోచరాచరులసృష్టి
సద్భక్తవరులతో సల్పునువటగోష్టి ♦ నిర్జరులంను నేనీదుదృష్టి
ఎంచఁగా నీహితుండైత్తెను కడుముష్టి ♦ భక్తులునిర్దలప్ప బడరునష్టి
నినునమ్మనట్టియాజనులకనావృష్టి ♦ దనుజాళికినినీకు తగినయష్టి
గీ॥ దివ్యరూపంబు విడిదాల్చితివిగఘృష్టి
వాసిగానిన్నుదలచినవాడెకృష్టి
సీతరామయసుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 46

సీ॥ పరమాత్మనీపైనవిరచింతుపద్యాలు ♦ విరివిగాసిరులివ్వవేసవేలు
దైరికామహిమగు గప్పితివౌసేలు ♦ కోరెనిర్స్త్రీలు పదారువేలు
లంచమిచ్చిరెభక్తులెంచఁగానువరాలు ♦ కడతేరలేదెపెర్గనికుచేలు
పురుషోత్తముఁడవనిఁబొగడితినన్నేలు ♦ నీపదంబునగిలైసింగిజాలు
గీ॥ నిక్కముగజంపెపగతుల నీదువాలు
నెమ్మితలపోయ లక్షలు నీగుణాలు
నవ్యతరభావనారాయణా హృదీశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 47

సీ॥ వసుధనీకునుబంట్లువానరమూకలు ♦ నరికితౌరారావణాసురునితలలు
తంపగానీసహోదరులుమిక్కిలిబలులు ♦ లరయనిన్నెదిరిరియసురవరులు
జలజనాభుండనిఁదలతురువిబుధులు ♦ మోదమిచ్చునుగదానీదుకథలు
భావింపసుధయనఁబడునీదుపల్కులు ♦ నీస్వరూపముచేతనగడెసిలలు
గీ॥ పరగనోయుమునాకున్న పాపలతలు
నళినలోచన యికదీరు నాదువెతలు
సీతరామయ్య సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 48

సీ॥ నీబొడ్డునను గల్గెనిర్మలంబుగ వేధ ♦ వరియించె నినుఁ గనివరలురాధ
కౌంతేయునకు మేలుగల్గెనీసద్బోధ ♦ నళి నాప్తగోత్ర గుణావిమేధ
నిన్నుమరచినవారికెన్నఁగాబలుబాధ ♦ గోటితో జిమ్మునాకున్నబాధ
పుణ్యవంతుడవంచుఁబొగడతినృపనాథ ♦ ఆగమాధరసుజనావరోధ

గీ॥ అతులితానందశ్రీహరి జితవిరాధ
క్రమతరభావ రాక్షసగణవిరోధ
నవ్యతరభావనారాయణాహ్వాదీశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ. 49

సీ॥ కడలిగంభీర శ్రీకందర్పనవరూప ♦ మునిజనమానసామోదదీప
శంకరనుతరిపుజన్యకాండవిలాప ♦ క్షీరాబ్ధిశయనమృగేంద్రకోప
యినశశినయనపావనకరహారరోప ♦ రాజీవనయననిరస్తపాప
బాషాపతిస్తోత్ర భాస్కరకులభూప ♦ దానప్రవీణసత్యానులాప

గీ॥ ప్రథితసద్భక్తపోష సూర్యప్రతాప
తప్పులన్నియు నీతోఁడఁజెప్పనోప
సీతరామయ్య సుగుణహ్వాస్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 50

సీ॥ ఖగకరవంశసాగర శశిగిరిధీర ♦ గజరాజుభక్తాది కలుషదూర
భజియింతునిన్ను నేభక్తితో మనసార ♦ విబుధవందితసదావిధికుమార
శతిసమానసదశకంఠగర్వవిదార ♦ భూపాలమౌళిబుధోపకార
వరబుధసంచయవర్ణితరాచార ♦ పావనాకారపాపాంధసూర

గీ॥ నమ్మియుంటిని బ్రోవవున్యాయ్యమేర
భూరిమయచేల పండరీపురవిహార
నవ్యతరభావ నారాయణాహ్వాదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 51

సీ॥ తమసభాస్కరనీసుతప్పకపదయుగ ♦ ములనుపూజించెదసలలితముగ
కరినుడంచునుమదిఁగానకుంటినిపురగ ♦ పతిశయ్యనమ్మితిపతఁగతురఁగ
దేవుడెవ్వరునీవెభావించిచూడఁగ ♦ అనువందమోక్షముకంపుత్వరఁగ
కాలకంఠునియిల్లు ఖండించితివడిగ ♦ వరములిచ్చిన నీకువాసితనుగ

గీ॥ స్వామినినుదల్తు నావాపసమితిఁదోలుగ
యింతసిద్ధయుడంచు నేడెన్న డెరుగ
సీతరామయ్య సుగుణహృస్థిరని వేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 52

సీ॥ యిందిరాదేవినికిష్టమాయిల్లాలు ♦ కోరిద్రావితివీవు గొల్లపాలు
నీవుదేవుడవంచు నెరనమ్మి జేజేలు ♦ కడతేర లేదనగ నగరుణనేలు
యెలమియేభక్తులుయిచ్చిరిలంచాలు ♦మంచిగాద్రుంచునాసంచితాలు
స్థిరముగానీయన్న చేపట్టినాగేలు ♦మహినీమ పల్కులు మధురసాలు

గీ॥ అమలరత్నమయంబటతమరిహాలు
నెలత నటుఁజంపిజెందితౌనిఁదపాలు
సవ్యతరభావనారాయణాహ్రుదీశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ. 53

సీ॥ రమణీయమైన నిరామయగోవింద ♦ బెట్టసత్రాజిత్తుపట్టినింద
కనజాలనేనీమకథలసారముపంద ♦ మురహారదలతునేమోక్షమంద
మంచిగాలెక్కకుమించినావులమంద ♦ గాచితివటవింతఘనులుజెంద
చిత్తశుద్ధిగనేనుఁ జేసితియొకవంద ♦ సీసపద్యంబులు గాసిఁజెంద

గీ॥ వేరుసేయక నన్నేలు విశ్వతుంద
భావజాకార నినునమ్మిభవముజెంద
సీతరామయ్య సుగుణహృస్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 54

సీ॥ నైరితి వ్రాతకానన దగ్ధసుచిధీర ♦ తాపస విభుధ పరోపకార
కణ్వకశ్యప యతిగార్గేయ సత్పరాచర ♦ భరద్వాజసంస్మరవిచార
కుమతులాపగతులఁ గూల్చెనీశరధార ♦ విందురౌనికధల్ వీనులార
భోగీంద్రశయనవిఁ బాగడుదుపాలుపార ♦ శ్రీహరినన్ను రక్షింపవేర
గీ॥ నిర్మలంబగు కృతిఁజేతునీదుపేర
శ్రితజనానంద రుక్మిణీచిత్తచోర
నవ్యతరభావ నారాయణాహ్వాదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 55

సీ॥ సర్వేరత్నాఁడవని స్మరియింపగావచ్చు ♦ గానసీదయ నెన్నగానుతచ్చు
నినునుతించినవారినేభక్తులనవచ్చు ♦ తిలకింపనీసేవఫలితమిచ్చు
పార్వతీదేవినీపఠనమిక్కిలిమెచ్చు ♦ కమలాక్షుసన్నేలు ఘనతవచ్చు
కడగినీబంటులంకకుబెట్టుకార్చిచ్చు ♦ నిఖిలదేవతలలోనివె హేమ
గీ॥ పన్నుగానీకు యీకృతివన్నెతెచ్చు
స్త్రీలుపురుషులు నీసేవఁజేయవచ్చు
సీతరామయసుగుణాహ్వస్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 56

సీ॥ వటుఁడవైబలినిబల్ల్వంచిదేవేంద్రున ♦ కునురాజ్యమిచ్చినవనజనయన
నరహరివైహిరణ్యాక్షునిఁగూల్చిన ♦ పరమాత్ముఁడనుచునుపండితులన
వినియుంటివన్నేలు విబుధజనావన ♦ మరువకఁగాచితౌమానినవన
ధారణిశిశుపాలదంతవక్త్రులప్రాణమపహరించిన ♦ కృష్ణుడనుచుమదిన
గీ॥ దలఁచితినియువ్వసిరులుయీతక్షణమున
కఠినమూనంగ ధర్మమా గరుడగమన
నవ్యతరభావనారాయణా హ్వాదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 57

సీ॥ గాధిజసవనంబుఁగాచినావటముందు ♦ నన్నురక్షించుటన్యాయ్యమాదు
పాలుపొందభక్తులఁబ్రోచినావనివిందు ♦ ధ్యానరాధేయనీదయనుగందు
శరణాగతత్రాణబిరుదునీకుపసందు ♦ యోగిదేముఖుడునీభోగమందు
కందర్పజనకసర్గ్గావవుయేమందు ♦ నేదైనసత్కీర్తినిన్నుఁబొందు

గీ॥ ధరణిలోపలనీదాసదాసులందు
కఠినమానగయములోకగతినిగందు
సీతరామయ్య సుగుణహృస్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 58

సీ॥ హరుశరాసనమునుయవలీలగాద్రుంచి సీతనుపెండ్లాడిసిరివహించి
రహిమీరగనుపర్శురామునినొప్పించి ♦ పూర్తిగాదిక్కులకీర్తిగాంచి
వొప్పుగాత్వరగ నయోధ్యకునేతెంచి ♦ జనకాజ్ఞతాసిర్సావహించి
కైకవరంబునుగనిమదిచింతించి ♦ భయదాటవికినేగి బలుచరించి

గీ॥ అట్టి శ్రీరామచంద్రవర్ణన్నాదరించి
కరుణతో మోక్షమిమ్ము నీకనులగాంచి
నవ్యతరభావనారాయణా హృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 59

సీ॥ మించిరక్కసులనుద్రుంచెనీచేవాలు ♦ నెరినయోధ్యాపురినీనుప్రోలు
దనరనీమిత్రుఁడుదాల్చెనుపులితోలు ♦ భయదాటవినిబడ్డదయనుగ్రాలు
పుడమిజానీకనుఁబోసెనుశలఁబాలు ♦ పన్నగాధిపశాయినన్నుయేలు
వాలాయముగనీవుదోలునాపాపాలు ♦ కమలాక్షునిర్దల్వగల్గుశ్రీలు

గీ॥ మోదమొసఁగునుజనులకునీదుచరూలు
భక్తిమరునడునీదగుబాసవాలు
సీతరామయసుగుణహృస్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 60

సీ॥ సారసనేత్ర నీసద్భక్తులకుముక్తి ♦ పరిపంథులెరుగునీ బాహుశక్తి
కురురాజెరుంగడు క్రూరమాసీయుక్తి ♦ నిరతంబుమరువనునీమహభక్తి
పరమపావననామ బల్కకుకతినోక్తి ♦ నేరరాదిత్యులు నీదుసూక్తి
శరణాగతత్రాణ బిరుదనిలోకోక్తి ♦ గలదునీకథలెన్న గానరక్తి
గీ॥ త్వరగదాసుల నేలుటే తగినశక్తి
శ్రీకరంబుగ నీస్తుతే నాకుభుక్తి
సీతరామయసుగుణహృస్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 61

సీ॥ సుగ్రీవునకు రాజ్యసుఖమిచ్చితివినాఁడు ♦ నీకీర్తి దిక్కుల నిండెనేడు
నిర్భాగ్యులైనవారైన నిన్నెన్నగాఁబోఁడు ♦ భక్తుఁడునీపైనపాటఁబాఁడు
తలుపఁగాపులితోలుదాల్చెసంగడి కాఁడు కమలాక్షునీపురకన్యలఁజూఁడు
పోకిరినీకతల్ పొందుగావినఁబోఁడు ♦ నారదుండునుతించినాట్యమాఁడు
గీ॥ తొలుత పూజింతు నీదుపాదుకలజోడు
పుట్టి వరమివ్వకున్న నీయబ్బతోడు
నవ్యతరభావనా రాయణా హృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 62

సీ॥ పొంచితివనినిరసించెను నినువాలి ♦ స్తుతియింపడేకబంధుండుగూలి
నినుఁజూచిసాల్వుండువినఁజేసెగాగేలి ♦ సాక్షిరినీవారుసురనుగ్రోలి
తాటకిదునిమనీపాటిమగటిమజోలినినుదూలడెసుయోధనుఁడుప్రవాలి
కుట్టడంచునుయెత్తుకొనిఁజచ్చెపెనుగాలి ♦ చెలగినీమాయలోఁజిక్కెశూలి
గీ॥ భూమిలో లేడు నీవంటి పుణ్యశాలి
వన్నెగాంచుము వేగమే నన్నుయేలి
సీతరామయ్య సుగుణహృస్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 63

సీ॥ నినుఁ దాకిమడసిరి నిష్ఠరాహితకోటి ♦ లోకమందెవ్వరు నీకుపోటి
ధర్మాస్పదంబులైదనరె నీవాగ్ధాటి ♦ నిఖిలజనులకు మాతనీపఘూఁటి
సురవైరిమీఁదనుఁజూపితివౌధాటి ♦ ఎలమినసత్వమునని కెవరుసాఁటి
యిమ్ముగాశరము వేగ నిమ్మలో మ్ముననాఁటి ♦ తెమ్మనఁజావదే మున్ని శాఁటి
గీ॥ పద్యములువ్రాతు నీపదభక్తితోఁటి
తాపసుల కెల్ల నీ పేరుధనము పేటి
నవ్యతరభావనారాయణా హృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 64

సీ॥ సన్నుతించెద నిన్ను సద్గుణౌఘవిరాజ ♦ కరుణించుమనను కవికల్పభూజ
బలవంతుడవునీవు భాస్కరసమతేజ ♦ రహినేలుమనుదశరథతనూజ
నీకీర్తిగణుతింతు నేను రాజవిరాజ ♦ పాపిని బ్రోవు నై భవబిడౌజ
కృష్ణసద్యశజితకృతతారకారాజ ♦ స్మరియింతునిన్ను రాకు.సవిరాజ
గీ॥ జేర్చునిదండ తుదియంఘ్రిజితసరోజ
భక్తరక్షణ జేతునీపాదపూజ
సీతరామయసుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 65

సీ॥ కౌసల్యగర్భ ముక్తాఫలంబని పేరు ♦ జెందితి పద్యముల్ జేతునూరు
నీలమేఘముచాయ నిరసించెనీసౌరు ♦ సన్నుతించితినివోస్వామిహారు
భక్తితోడుతనునీపాదముల్ పలుమారు ♦ పూజింతురయ్య జేజేల బారు
స్థిరహేమకశ్యపుఁ జీల్చెనునీగోరు ♦ నిర్భాగ్యుడెవ్వరై ననిన్నుదూరు
గీ॥ పరికటితంబుగనన్నుఁ జేయకుము వేరు
పన్నుగాదైవమెవరు నీకన్న లేరు
నవ్యతరభావనారాయణాహృదీశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ. 66

సీ॥ పదరజంబునసోకి పాషాణమును నాతి ♦ యయ్యె జెందితివి నీవట్టిఖ్యాతి
జెప్పె జానకి వార్త దప్పక నొకకోతి ♦ మెప్పుగా నినుఁ గోరె చుప్పనాతి
పరిపంథులకు నెల్ల భయము నీ చేహేతి ♦ సాధులకును దెల్పు నీవు నీతి
యింతికతినుడివంచు యే నెఱుంగక పోతి ♦ మోద మొసంగు ప్రహ్లాదురీతి

గీ॥ యిలనుఁగూలద్రోసనుమించి యిందరిసూతి
తారుమారైరి నీచేత దనుజజాతి
సీతరామయ్య సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 67

సీ॥ కలుషాంధకార భాస్కర నిన్ను వర్ణింతు ♦ భవహర నాదు పాపముల ద్రుంతు
కరుణాసముద్ర శ్రీకరముగ నినుగాంతు ♦ తవిలి మోక్షంబివ్వ తమరివంతు
సజ్జనాధార నీసాటివ్వరని యెంతు ♦ నిఖిలచరాచరుల్ నీను సంతు
మందరాద్రిసుధీర యందాక సైరింతు ♦ బెట్టకు నాపైన వట్టిరంతు

గీ॥ వెట్కుతోడను వరమివ్వ వేతుగంతు
సార్వభౌముఁడవనుచు నేసంతసింతు
నవ్యతరభావ నారాయణాహృదీశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 68

సీ॥ సింగిగంగాదేవి నీపాదమునఁ బుట్టె ♦ నన్ను రక్షింపక యున్న వట్టె
నీదెబ్బకును నల్గి నెరివాలి నిచుదిట్టె ♦ భవసమాహితుఁడవై బగత కట్టె
సలుడు నీకోసమై జలధి కట్టగ గట్టె ♦ పగతుల సీవాలు భంగపెట్టె
వసుధసతాప్రిజిత్తు వాదొక్కటినిఁ బెట్టె ♦ నేటుగా గోపెమ్మ గోటగట్టె

గీ॥ ఎలమి నీదానమునకీ గెయీావి చెట్టె
తెలుప నీకీర్తి మహిమ దిక్కులను ముట్టె
సీతరామయ్య సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 69

సీ॥ కర మొప్పనీపాదకమలములే ప్రొద్దు ♦ రహిని పూజింతు పరాకు వద్దు
దశరథాత్మజ నా మతప్పులు తగ దిద్దు ♦ పరగ నీదు దల్వని నరుండు మొద్దు
కణగి నీసంగడి కాడెక్కడెల్లెద్దు ♦ తిలకింప నీదు దల్వ ఫలము గద్దు
దయమాని పూని తౌదనుల పైజిద్దు ♦ కనుంగొన హాని నీదు కథలు ముద్దు

గీ॥ గాననీపేరునకు వేరెకథలురద్దు
లోకనాయక నీభక్తి నాకుహద్దు
సవ్యేతరభావనారాయణాహ్వాదీశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ. 70

సీ॥ వామ్నావతార నీవర్ణింతు నొకసారి ♦ దయతోడ నన్నేలు దనుజవైరి
నీస్నేహితుండయ్యె నెగడెను త్రిపురారి ♦ వందనమిదిగో గోవిందశౌరి
భక్తజనంబులు పలుమారు నినుంగోరి ♦ కడతేర లేదనిక్కముగ భూరి
చెలువప్ప నీచేత సిరిగాంచె జంభారి ♦ కాపాడుమయ్య పరోపకారి

గీ॥ దశరథాత్మజ నీపేరుందలచె గౌరి
గట్టిగా నీకు పదమున బుట్టె వారి
సీతరామయ్య సుగుణాహ్వాస్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 71

సీ॥ కర మునీ చెలికాని కాపురం బేగట్టు ♦ యరివర్గములను నీశరము మట్టు
తరుణి యయ్యెను పాదతాడనంబున చట్టు ♦ భాపింప నీదానమీవి చెట్టు
దేవయవ్వరికిని తెలియదు నీగుట్టు ♦ ఘనమైన వైకుంఠము నికిపట్టు
బీదవాడనటంచుం బెట్టకు పైరట్టు ♦ భక్తుండు కదు నిన్ను బాధపెట్టు

గీ॥ వాసవార్చిత నిన్నెన్ను వాడె భట్టు
వరములివకున్నదిట్టెదవట్టుబెట్టు
సవ్యేతరభావ నారాయణాహ్వాదీశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 72

సీ॥ రాజితంబౌ పాపరాయుడు నీపక్క ♦ కదమ వేల్పులకు నిక్కముగ మ్రొక్క
నీనామ మధురమే నెరివేతు నొకగ్రుక్క ♦ గాన నేదల్వ నీకథలు దక్క
హారి నిన్నుదల్వని యధమాధముండు కుక్క ♦ నిఖిల దేవతలెల్ల నీకు లెక్క
కరిరాజు మకరిచే కడు బాధలను నొక్క ♦ గాంచి రక్షించితి ఘనత దక్క
గీ॥ భూరి నిను నమ్మ యమలోకమున నుంజక్క.
మనుజుడైనరైన నినుమర్వ తినునె నక్క
శీతరామయ్య సుగుణహృస్థిర నివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 73

సీ॥ పరమపావననామ పరుడను నేగాను ♦ వేడి నీదాసుల గూడివాను
నీలమేఘముఛాయ నిరసించె నీమేను ♦ వరమిచ్చుదాకనిర్ వదలిపోను
పుండరీకదళాక్షు బ్రోవుము నీసూను ♦ డనిమనంబున నన్ను ఘనతతోను
కరుణతోడను నన్ను గాంచి నిదయతోను ♦ స్థిరముగా ననుఁగావు దీక్షతోను
గీ॥ చిత్తశుద్ధిగ నీపూజఁ జేసెదాను
కఠినుడనకను నాపైన కక్షమాను
సవ్యేతర భావ నారాయణహృదీశ
మలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 74

సీ॥ ఘనసింహామై హేమకశ్యపుండను వానిఁ ♦ జంపినాడవుగ దాచలముతోని
స్మరియింతు నీదగు స్మరణయే భూజాని ♦ తరియించె నిర్ దల్చి త్వరగదాని
కడ తేరె నీకృపాకరము చేత భవాని ♦ కృతినందు నాపైన కృపనుఁబూని
తిలకింప నినునమ్మి గొలచువాడే జ్ఞాని ♦ పరిపంథులెదిరించి పడరె హాని
గీ॥ మేటివేల్పుండవనుచు వాల్మీకమౌని
ప్రేమదమెసగఁగ కృతిఁజేసె పనులుమాని
సీతరామయ్య సుగుణహృస్థిర నివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 75

సీ॥ సన్నుతించెద నిన్ను సారసదళనేత్ర ♦ మరువక నన్నేలుమా కళత్ర
దర్పకసమకార దానవకులజైత్ర ♦ వర్ణితామరవార స్వర్ణనేత్ర
సూరిజనాధార శుభకర చారిత్ర ♦ తామసగర్వలతాలపత్ర
శ్రీకంఠవినుత దివాకరసద్గోత్ర ♦ కనకాద్రిసమదృఢఘనవగాత్ర
గీ॥ రమ్యతరవేష దశరథరాజపుత్ర
విబుధపండితసజ్జన వినుతపాత్ర
సవ్యతర భావనారాయణా హృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ. 76

సీ॥ పటుబలశౌర్యశ్రీపాలితసుత్రామ ♦ కంటకాంతక సువైకుంఠధామ
సంగరభీమ మాతంగపోషితసీమ ♦ అంబుజహిత సువంశాబ్ధిసోమ
పరమేశశివచాప భంజనగుణధామ ♦ సంతతానంద యనంతనామ
భువనైత్రయాధార రవికోటిసమధామ ♦ శోభనాకార జనాభిరామ
గీ॥ ప్రాపుఁజేరితి నాపైనఁజూపు ప్రేమ
వసుమతీశ్వర దుష్టరాక్షసవిరామ
సీతరామయసుగుణహృష్ఠినివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 77

సీ॥ శ్రీసత్యభామ మనోసరసిజఖేల ♦ కర్బురమయ సత్ప్రకాశచేల
దుర్మార్గవైరి సందోహభీకరకాల ♦ భక్తసంరక్షణా సక్తశీల
గంగానదీ తరంగాంచితవాగ్జాల ♦ దీనమానవ సమూహానుకూల
దుర్వృజనోత్సంగతూలోరువాతూల ♦ దిగ్వ్యాపితాశ్చకీర్తిసువిశాల
గీ॥ మానితాకార పూజింతు మల్లెపూల
తడవుఁజేసిన నేనింక తాళజాల
నవ్యతర భావనారాయణా హృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 78

సీ॥ కందర్పసమపురఖలదైత్యకులమార ♦ శ్రీరమాహృదయరాజీవసూర
కుండలిశయనసత్కోవిదతతిభార ♦ దేవదేవేశయశోవిహార
రణధీరుడగుపంక్తిరథునకగ్రకుమార ♦ ఖండలసమభోగకలుషహార
వరగుణాకరరిపువారవన్యకుఠార ♦ మంగళాచారహిమాద్రిధీర
గీ॥ భువనవందితపండరిపురవిహార
సారసేక్షణనన్నేలజాలమేర
సీతరామయ్య సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 79

సీ॥ పున్నమచందురుఁబోలుసీవదనంబు ♦ పరమాత్మనీస్తుతి భవహరంబు
మంచిగానీకృపనుంచినాపాపంబు ♦ కడద్రోయుటేమంచికనికరంబు
హల్యశాపముబాపెనట్టినీపాదంబు ♦ ఘనపండరీపురికాపురంబు
దశరథాత్మజనాకుదయతోడమోక్షంబుదయసేయుటేనాకుతగుధనంబు
గీ॥ అంబికకు నీనుపేరు కర్ణామృతంబు
ఆశతోఁ జేతు నీసేవ యనుదినంబు
సర్వతరభావ నారాయణాహృదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 80

సీ॥ నిర్మలంబుగఁబుట్టెనీపాదమునగంగ ♦ పాలితామరవారపావనాంగ
శ్రీరమణీమణిచిత్తపద్మపతంగ ♦ దనుజాబ్రిపవనసత్యప్రసంగ
కాంచనాంబరనన్నుఁగావుపక్షితురంగ ♦ భక్తమానీంద్రాదిభవవిభంగ
రమ్యచారిత్రనిరామయశ్రీరంగ ♦ రఘుకులతిలకధర్మానుషంగ
గీ॥ బ్రస్తుతించెదనిన్ను నే భాసిలంగ
వేరుసేయగవరమివ్వ వెన్నదొంగ
సీతరామయ్య సుగుణహృత్స్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 81

సీ॥ తత్పదంబులు నేరుతలనుందాల్చెద దేవ ♦ భవములుకడ్రోయు వాసుదేవ
భావజాకార నీ భజన మోక్షపుత్రోవ ♦ అందివ్వసిరులు మహానుభావ
సంసార బాధలు సమయించుటకు నీవ ♦ బ్రస్తుతింపంగ బిరాన రావ
యీతరి బ్రోవకున్నతు నీపైదావ ♦ కరిరాజుఁ జూడ నాకన్నలావ
గీ॥ పుణ్యవంతుఁడ నైతివి భువిని దేవ
పన్నగానాదు బాములుఁ బాపలేవ
నవ్యతర భావ నారాయణాహ్వాదీశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 82

సీ॥ కైకవరంబున కాననంబున కేగి ♦ విపులరాక్షసులతో వేగివేగి
వాలినిఁ జంపితే వడి బాణమున డాగి ♦ భూతలంబున కునీ తాతత్యాగి
పగరసోదరుఁడు నీపదభక్తి కినిలోఁగిఁ ♦ జెప్పె మర్మములంక చెడక సాగి
నినునుతించని యెడ్డె మనుజుఁడు కనమూగి ♦ దయనున న్నేలుము తల్పభోగి
గీ॥ ఖరునిం జంపెదే నీ బాణక షీమితూగి
వనధిబంధన చేసితి నేవాగివాగి
సీతరామయహ్వాదయ సుస్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 83

సీ॥ తంగాబ్బ్వయాబ్ధి సుధాకర మోక్షమ్ము కరుణచేనొసగుము కడు శుభమ్ము
భవనుత నీదు సద్భక్తి భక్తుల సొమ్ము ♦ యీకృతి నీకీర్తి కెంతో నెమ్ము
ఫలముకై పూజింతు తలప నీపాదమ్ము ♦ జగతీశ నాపాపము గరంచిమ్ము
పరమాత్మ నీనోటి పల్కె శృంగారమ్ములని యెన్నబడిరి గాయలజనమ్ము
గీ॥ దాశరథి బ్రోవ నన్నిటు త్వరగరమ్ము
బ్రస్తుతించిన నీనామ భవహరమ్ము
నవ్యతర భావనారాయణాహ్వాదీశ-
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 84

సీ॥ భూమిజావరనాతోఁ బూనకుయిటుకక్షహల్యాశాపవిమోచనాయదీక్ష
యినశశినయన పావనకరిసంరక్ష ♦ దివిజారిహరణ కౌంతేయపక్ష
తలపసీసపద్యములుఁ జేసెదనులక్ష ♦ సాగరశయనవిశాలవక్ష
భక్తాళినులసత్స్వభావ పక్షిముముక్ష ♦ నన్నేలుమిక కరుణాకటాక్ష

గీ॥ సుందరాకార నాపైనఁ జూపవేక్ష
సారదిసిన్నన్నతరమానశూరదక్ష
సీతరామయ్య సుగుణహృస్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 85

సీ॥ మన్నించుసత్వరిమాసితెసుపిచార ♦ సేవనేజేతువామ్నావతార
సూనృతకవిబుధసూరిజనాధార ♦ రాజీవనయనకూర్మావతార
బలినిపాతాళానబంధించితివిశూర ♦ దేవాదిదేవకృష్ణావతార
వుగ్రహితాసర్వవిగ్రహాసువికార ♦ ధర్మమార్గైకబుద్ధావతార

గీ॥ క్రమతరభావశ్రీశకల్క్యావతార
కేవలానందహృదయరామావతార
నవ్యతరభావనారాయణాహృదీశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ. 86

సీ॥ చిత్తజరూపనేఁజేరితినీప్రాఁపు ♦ నెరికన్నులకుఁజూఁపుసీదురూపు
పరమేశనేఁజేయుపాపములనుఁ బాపు ♦ శ్రీపతినుతియింతురేపుమాపు
కొంకకనీబల్మికొండలైనను లేపు ♦ నిఖిలపగతులఁజంపెనీదుతూపు
పరగనాతలమీదపాదముల్ తగమోపు ♦ కోర్కెదీరఁగమోతుకొంతసేపు

గీ॥ బట్టుకవితోడమొందుకు యిట్టిరాపు
పంతమూనకమోక్షమిప్పట్టుఁజూపు
సీతరామయసుగుణహృస్థిరనివేశ
విమలగుణకోశతిరుపతివెంకటేశ॥ 87

సీ॥ యహిరాజతల్పునన్ న్నాదరించుమటంచు బ్రస్తుతించితిని మొరాలకించు
పాలలోచనసఖాధవభంధములుద్రుంచు ♦ కంధిగంభీరనన్ న్నారవించు
అరయనీకొడుక్కమోహాంబుధిలోముంచు ♦ శ్రీపురుషజాతికిన్ న్నేపుమించు
ఆకొన్నభక్తులనరలేకపాలించు ♦ సత్కీర్తిదిక్కులనెరిచరించు

గీ॥ మెచ్చిరమియింప రుక్మిణీయిచ్చగించు
కాళిచుతియిం చెని పేరుమేలటంచు
నవ్యతరభావనారాయణాహ్వాదీశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 88

సీ॥ సత్యంబుగానీకుసాగరంబేయిల్లు ♦ మూడులోకములనీమూద్రజెల్లు
భావింపరుక్మిణీపన్నీరుపైజల్లు ♦ రిపులకునీహేతిరేగుముల్లు
నీనుప్రసంగంబు మోదమైరంజిల్లు ♦ దనుజాళిసిన్ న్నసితల్లడిల్లు
నీకతల్ వినసట్టినిచుని లేకొల్లుం ♦ జడదన్నితీపిముంనుబండిగల్లు

గీ॥ పాపఘుమ్నుడుతెల్యకబహుగిరోల్లు
నీతికైద్రుంచితివిసూడుశిపునియిల్లు
సీతరామయ్య సుగుణాహ్వాస్థిరసివేశ
విమలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 89

సీ॥ యింద్రునకునురాజ్యమిచ్చికొంటివికీర్తి ♦ స్మరించునిన్నపుడ్డసాంబమూర్తి
అతివనుజంపినావనినీకుయపకీర్తి ♦ రహివహించితివీవురామమూర్తి
నీపైనశతకంబునేనుజేసెదపూర్తి ♦ నయమొప్పదీర్చుమునాదుయార్తి
రిక్తుడంచనబోకుభక్తాళివశవర్తి ♦ జలజాక్షరిపుహారచక్రవర్తి

గీ॥ జన్మసాఫల్యముగజేయుసరివార్తి
మరువజాలనునిన్ను నేమదవమూర్తి
నవ్యతరభావ నారాయణాహ్వాదీశ
మలగుణకోశ తిరుపతివెంకటేశ॥ 90

సీ॥ కడతేరెదనునమ్మి కణగి విభీషణ ♦ పతియించితివి నీదు పాదస్మరణ
నీసతిఁ జెరఁగొని నీల్గెనా రావణ ♦ యమల వేదాంత విద్యాప్రవీణ
కరి నేలితివి నాఁడు శరణాగతత్రాణ ♦ బీదలపైఁ జూపు నీదు కరుణ
నీమాయఁ దెలియదు కామారికిని ♦ భ్రూణాలోకమేధికానేకభాణ

గీ॥ మించెనీరూపు నూతన పంచబాణ
యసురులను నీవు జంపితౌ ఘోరబాణ
సీతరామయ్య సుగుణహృత్స్థిర నివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 91

సీ॥ తిలకింప ఎవరికి తెలియదు నీజాడ ♦ ఖండించితివి నాదు కర్మపీడ
నింగినీఁదాకును నేర్పుతో నీ ఘోడ ♦ పరమేశ నినుఁ దప్ప పరుల వేఁడ
నీకథల్ ల్గానివి నేకన్నులనుఁ జూడ ♦ నీకీర్తనలుఁ దప్ప నేవిఁ జూడ
నీకుమాయం డెంతలోకంబులకు పొంగఁ ♦ నాదు చిత్తాబ్జంబు నీదు మేఁడ

గీ॥ వరములిచ్చియు నన్నేలు వన్నెకాఁడ
యిమ్ముగా తండ్రివని నిన్ను నమ్మినాఁడ
నవ్యతర భావ నారాయణాహృదీశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 92

సీ॥ లోకంబులను దాచె నీ కన్యగర్భంబు ♦ ననుఁ గాంచుయీ డేరు నాతపంబు
జలజాక్షుని పూజ సల్పును నా నిశంబు ♦ నయముగాఁ బాపవే నా భయంబు
దరిఁ జేరినాను నిర్ధనుడని కోపంబుఁ ♦ బడక నాకివ్వుము కడు శుభంబు
వటపత్రశయన నీ వాక్కు లేయమృతంబు కరమునుంచితివి చక్రాయుధంబు

గీ॥ గట్టిగాఁ బ్రోవు నర్తనగనికనికరంబు
నమ్మకము నిన్నుఁ జడరేదానవకులంబు
శీతరామయ్య సుగుణహృత్స్థితనివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 93

సీ॥ పరమాత్ముఁడనుచు నిన్ బ్రస్తుతించితి నేడు కరుణించ వేగ నీకనులఁ జూడు
క్షితిపురారాతి నీకిత్తైన చెలికాఁడు ♦ నిర్జరాధిపుఁడు నీకు తోడు
నీసుందరమునకు నెమ్మిక నెవ్వండీఁడు ♦ రాఘవనినుఁదల్వ రామకీఁడు
దేవశివధర్మముఁ ద్రుంచితివల నాఁడు ♦ భీకరాటవియయ్యె నీకుఁ బీడు

గీ॥ తప్పకను గొల్తు నీను పాదముల జోడు
వసుధ నీమిత్రునకు గీము వల్ల కాఁడు
నవ్యతర భావ నారాయణా హృదీశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 94

సీ॥ సీతకైఁ గూర్చితౌ క్షితిని వానరదండు ♦ కృపలేక నీ బాఁకు రిపుల చెండు
సిరిఁ జెందెఁ జూడఁ నీ చేకపినాథుండు ♦ రహినీల్గెనినుఁ దాకి రావణుండు
నినునుతించని యెడ్డ మనుజుండుగనతుండు మాధిగా గొల్చుమరుత్సుతుండు
చెలువప్పఁ జచ్చని చేతకబంధుండు ♦ ప్రభవించె నీవల్ల పద్మజుండు

గీ॥ కణగి మూర్ఖుండు నిన్నెన్న గానకుండు
మానుగా పాపపెండు నీపైనఁ బండు
సీతరామయ హృదయ సుస్థిర నివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 95

సీ॥ వాసవార్చిత చిద్విలాస నీ సత్వంబు ♦ వర్ణించుటకును నెవ్వరివశంబు
పాపరక్కసులకు భయము నీకోపంబు ♦ కవులపైఁ జూపు నీ కనికరంబు
హితవగు తేనియ కనయు నీవాక్యంబు ♦ సద్భక్తులకు నీవు సమ్మతంబు
తులలేని విభవంబు గలవాఁడవని శంబు ♦ కందర్పునకుఁ బోలు సుందరంబు

గీ॥ ఖలులసమయించె నీదు చక్రాయుధంబు
నెమ్మిగనఁ జాల రెవరును నీ నిజంబు
నవ్యతర భావనారాయణా హృదీశ-
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 96

సీ॥ వర్ణింతు నిన్నునే వారాసిగాంభీర్య ♦ శ్రీకరశుభగాత్ర సింహశౌర్య
పఠియించె నీనామ పఠననిత్యంబార్య ♦ కఠినశాత్రవజిత కదనధుర్య
పలుమారుఁ జేతు నేభక్తితోఁడ సపర్య ♦ రక్షించుమో జగద్రక్షుదార్య
పగరెరుంగరు నీదు పటుశరంబులచర్య ♦ నిఖిలసంపదలిచ్చు నీదు భార్య

గీ॥ వివిధపండితసత్కవివినుతసూర్య
దానవరాధిపవినుత రామానుజార్య
సీతరామయహృదయ సుస్థిరనివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 97

సీ॥ ఏడుకొండలపైన ఎక్కియుఁ గూర్చున్న సుఖమునుకొంటివా సుప్రసన్న
అనువంద నాస్తోత్రమాలకించకయున్న ♦ సరవిమీరగ నీయశంబుసున్న
పరమార్థులెవ్వరు పరికింపనీకన్న ♦ ఎవ్వరు నుతియింతు రింతకన్న
పలుమారునీనామ పఠనఁ జేయకయున్న ♦ ఎమగాథ చే నరుఁ డేడ్చునన్న

గీ॥ రామయనవట్టి వారల గీమునున్న
ఎలమి నినునమ్మి పరమందె యేన్గుగున్న
నవ్యతర భావనారాయణా హృదీశ—
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 98

సీ॥ దానవసంచయఖల దైత్యకులమార ♦ శ్రీలక్ష్మిహృదయ రాజీవసూర
కుండలీశయవసతోకవిదతతిభార ♦ దేవదేవేశ యశోవిహార
రణధీరుఁడగు పంక్తిరథునకగ్రకుమార ♦ ఖండలసముభోగ కలుషహార
వరగుణాకరశత్రువావన్యకుఠార ♦ మంగళాచారహిమాద్రిధీర

గీ॥ సన్మునివంద్య వేంకటాచలవిహార
సారసేక్షణ నన్నేలజాలమేర
సీతరామయ్య సుగుణహృత్సుస్థిర నివేశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 99

సీ॥ సర్వేశ సతతంబు పర్వతంబే యిల్లు ♦ మూడులోకముల నీముద్ర జెల్లు
భావింపయలివేలు పన్నీరు పైజల్లు ♦ పగరకు నీబాకుబలుసుముల్లు
నీదుప్రసంగంబు మోద మైరంజిల్లు ♦ దనుజాళి నీవన్న తల్లడిల్లు
నీకథల్ విననట్టి నీచుని ల్లేకొల్లు ♦ వింతగా నీపనుల్ సంతసిల్లు

గీ॥ పాపకర్ముండు తెల్యక బహుగ రొల్లు
సీత కైదృంచితివి నాడు శివుని యిల్లు
నవ్యతరభావ నారాయణాహ్వాదీశ
విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 100

సీ॥ కొమరొర్ప కుంకులకుంట నివాసుండ ♦ వర్ణిత రాడ్భట్లు వంశజుండ
పరికింపగను రాళ్ళబండి సద్గోత్రుండ ♦ నరయ నప్పల రాజు గూరాత్మజుండ
రహిపూసపాటి శ్రీరంగరాట్ శిష్యుండ ♦ రామసత్కవి యను నామకుండ
రంగభాట్ కోటమ రాజుల కనుజుండ ♦ పరమభక్తుల గొల్చు పావనుండ

గీ॥ వెంకటేశుండ నినుమది వేడి పూలదండగా గూర్చి పద్యముల్ దప్పకుండ
సలలితంబుగ వ్రాతు నీగళమునిండ విమలగుణకోశ తిరుపతి వెంకటేశ॥ 101

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

సంపూర్ణము



శ్రీరామ సహాయము.

# శ్రీ తిరుపతి వెంకటేశ్వర వృత్తశతకము



ఉ॥ శ్రీయుతు డార్తరక్షకుఁడు సింధు గభీరుఁడు పావనుండు య
న్యాయవిదూరుడున్ సుజన ధ్యానపరుండు హిరణ్య గర్భుడున్
వాయు సఖాసఖుండు ఖలవర్జితుడౌ అల వెంకటేశ్వరుం
డాయిగ తాతవంశభవుఁ డర్థి సురాగముఁడైన సత్యనా
రాయణగారికిన్ విభవ రాజినొసంగు సదా ముదంబునన్॥ ౧

శా॥ శ్రీరాధా హృదయాబ్జ బంభరుఁడు సు క్షేమాంతరంగుండు స
ద్గోరాజాది నుతుండు సద్గుణుఁడు సద్గోత్రుండు ధీరుండు సు
శ్రీరాజిల్లెడు వెంకటేశ్వరుఁడు శ్రీ క్షేమాఢ్యుడౌ తాత సీ
తారామయ్యను యిష్టభోగముల నత్యానందునిన్ జేయుతన్॥ ౨

ఉ॥ శ్రీరమణీమణీ హృదయ సేముషిపద్మ ప్రభాకరామరా
చారణ సిద్ధసాధ్య సురసన్నుతదేవ యశఃప్రభావ శృం
గార వచోప్రసంగ దశకంఠ విలుంఠన నీలనీరదా
కార బుధావనా వరదఁగావుము తిర్పతి వెంకటేశ్వరా॥ 3

చ॥ నిరుపమ నీలగాత్ర ధర నీరజనేత్ర బుధాళి బాధ దు
ష్కరవనహేతిహోత్ర సుర సజ్జనమిత్ర సురారిశత్రు భా
సురతర భర్మనేత్ర మధుసూదన పాప లతాలవిత్ర శ్రీ
తిరుపతి వెంకటేశ కవిధీజనపాలన శ్రీ సురేశ్వరా॥ ౪

చ॥ గరుడతురంగ చంద్రధర కార్ముక భంగ తమఃపతంగ సా
గరజ హృదాబ్జభృంగ నవకంధర నీలశుభాంగ సంతతా
వరబుధసంగ సంగరనివారిత శత్రుశుభప్రసంగ శ్రీ
తిరుపతి వెంకటేశ్వర సుధీవరపాలన శ్రీ సురేశ్వరా॥ ౫

చ॥ పరమకృపాలవాల యరిభంజన సమ్భ్రమ భావలోల భా
సుర శివవంద్యసీల దయఁజూడుము నన్ను యశోపశాల సం
గర రిపుకాల నీదు పదకంజములర్థి నుతియింతు చాలగా
వరసను వెంకటాచలనివాస రమాధవ వెంకటేశ్వరా॥ ౬

చ॥ మారసమానమూర్తి రిపుమారణ దాస దయానువర్తి నీ
పేరును కృష్ణమూర్తి మునుపే వినియుంటిని నీదుకీర్తి నా
నేరములెన్నఁబోక కరుణించియు దీర్చుము నామయార్తి స
త్కారిజనావనా వరద తోయజలోచన వెంకటేశ్వరా॥ ౭

చ॥ ఖలజనజీవపాశ శివ కార్ముకభంజన ధీనివేశ భూ
వలయ సగర్భకోశ శుభవైభవధామ నిధిప్రకాశ నే
తలనుధరింతు సంతసము తత్పదయుగ్మము లో సురేశ నా
కలుషములెల్ల బోనణచి గావుము తిర్పతి వెంకటేశ్వరా॥ ౮

ఉ॥ భూరిమయప్రచేల కడుపుణ్యచరిత్ర బుధానుకూల భూ
దారగుణాలవాల ననుధన్యునిఁజేయవదేల లక్ష్మి హృ
త్సారసపూషవైరి వనదగ్ధ దవానలజాల సంతతో
దారమునీంద్ర పాలవనదాకృతి భూవర వెంకటేశ్వరా॥ ౯

ఉ॥ పాపముఁజేసినాఁడ ననుపాలనఁజేయుము వన్నెకాఁడ నీ
దాపుకుఁజేరినాఁడను కృతార్థునిఁజేయవు యేమిగాఁడ నా
లోపములెన్న వేఁడ మదిలోపలఁబెట్టకు యిట్టికేఁడ ని
ర్లేప నిరామయా శుభకరీవరదాయక వెంకటేశ్వరా॥ ౧౦

చ॥ కలుష విదూర వైరి జనగర్వితదార మహోపకార భూ
లలన మనోజ్ఞసూర సుబలాంతక నిర్మలకార మాధవా

జలజభవామరాది నుతచంద్రని భాశ్యకశైలమందిరా
హలధరభ్రాతనీల పురయజ్జ హితాన్వయ వెంకటేశ్వరా॥ ౧౧

ఉ॥ కోపముసేయవద్దు బుధకోవిదులన్ కడునేలుముద్దు ని
దాపుకుఁ జేర్చినన్ను శుభదాయకుఁ జేయుటే నీదుపద్దు చి
ద్రూపుడవంచు తాపసులు దృక్కులఁ గాంచి నుతింపుచుందురో
పాపవిదూర నన్నుఁగని పాలనఁజేయుము వెంకటేశ్వరా॥ ౧౨

ఉ॥ నీదయ నేలుమంటి హరి నిర్మలచిత్తుఁడవంటి యన్నదే
వాదముసేయనంటి చెడువైరులఁ బట్టియుదృంచుమంటి దా
మోదర మ్రొక్కుచుంటి సురభూరహమీఁగెని యీవికంటి కా
కోదరతల్ప శ్రీరమణ గోకులవర్ధన వెంకటేశ్వరా॥ ౧3

చ॥ కుముద హితాబ్ధిజాత నవకోమలవర్ణ శరీరసీత నీ
రమణియు లోకమాత సురరాజగనుంగొన సిక్రుభ్రాత స
ద్విమలగుణుండు ప్రోష్ఠ కపిపీరుఁడుఁ జూఁడగసీకుమాతయో
యమల సువర్ణచేల కృతినందియు నేలుము వెంకటేశ్వరా॥ ౧౪

ఉ॥ వారధి కన్యకాహృదయ వర్తి పయోదసమానమూర్తి చ
క్రారి నిభప్రకీర్తి యహిరాజ శయాననుతించి పూర్తిసం
స్కారముగాను వృత్తశతకంబును మంచిగచక్రవర్తి ని
పేరరచించినాఁడ కవిబృంద యుతంబుగ వెంకటేశ్వరా॥ ౧౫

ఉ॥ సూరిహృదాంతగేహ మధుసూదన వర్ణిత నీలదేహ కా
మారిసమానవ్యూహ రిపుమారకదంబక యుద్ధకోహ బ్రం
హ్మారమణానుతాంఘ్రి సురమేరుసమధృతదుగ్ధవార్ధ సం
చారసుధీర సూరకులచంద్రయశస్ఫుర వెంకటేశ్వరా॥ ౧౬

ఉ॥ దేవ మహానుభావ వసుదేవ సుపుత్ర పతత్రియాన సర్వ
స్వాప్రము సుప్రభావ దశకంఠవిలుంఠన నీదుసేవ స
త్త్వావనపాటకర్మ భవవిదారులఁజేయను మంచినావ సు
గ్రీవునికితి నేలునను కేశవమాధవ వెంకటేశ్వరా॥ ౧౭

ఉ॥ సూరిజనాభిరామ మధుసూదన పాపవిరామ యద్రియా
గార బుధావనా విహగకాండ శివస్తుతనామ లక్ష్మీ హృ
త్సారసధామ నిమ వరదా శుభదాయక మంగళాంగ సం
హార నిశాచరాది వనదాకృతి శ్రీవర వెంకటేశ్వరా॥ ౧౮

చ॥ ఖండన రుద్రచాప ద్విజకాండ మహాబలసింహకోప మా
ర్తాండ కులప్రదీప మురదానవహార నిరస్తపాప స
త్కుండల రాజతల్ప నవకోమల శ్యామలరూప సద్యశో
మండన నన్ను నేలుము రమాపతి వందిత వెంకటేశ్వరా॥ ౧౯

ఉ॥ శారద నారదాభ్రశర శంకర హారపటీర గోపతి
వారణతారహార పవివర్ణితసింహ యశస్సమాస శృం
గార వచోప్రసంగ విహగాధిపవాహ మురాసురాంతకా
చారణ సిద్ధయక్ష సురసన్నుత నేలుము వెంకటేశ్వరా॥ ౨౦

ఉ॥ శ్రీపరమేశ యింద్రముఖసేవిత పాద సదాప్రకాశ స
ద్భూప రమాహృదీశ పటుదోర్బల రాక్షసనాశ సత్కలా
లాపసునీల కేశ సుగుణాకర శ్రీకర శైలమందిరా
దీపిత రత్నభూషణ సుధీవరఁగావర వెంకటేశ్వరా॥ ౨౧

ఉ॥ వేదములందు స్వర్ణమయ వేదికలందు మహాద్భుతంబుగా
సాదులయందు సద్భవనజాలములందు యనాథలందు రా

గాసులయందు నిందనక కౌముదిరీతి ప్రకాశమానమై
నూదినిమోపుసందు యడజూచిన నీవెక వెంకటేశ్వరా॥ ౧౨

ఉ॥ మాయకళేబరంబు యిది మట్టిఘటంబని తెల్యలేక తా
వేయినుపాయముల్ వెదకి వీలగునంతకు మందిసొమ్ము ని
న్నాయిమటంచు నెంచక నహీనగుణంబులచే గ్రహించిరన్
న్యాయడె ముందు సూర్యజుఁడు కోపముచేతను వెంకటేశ్వరా॥ ౧3

ఉ॥ గానధురీణ రుద్రియిలుఖండన సజ్జన దీనసంతతా
ధ్యానపరాయణాఖ్య వనదాకృతి భూవర దేవదేవ సు
జ్ఞాన నిధాన సద్భవనజాండ మహోదర బ్రోవవేమి స
ద్దీనదయానిధే తిరుపతీస్థలవాసను వెంకటేశ్వరా॥ ౧౪

ఉ॥ కాయము నిత్యమంచు కనుఁగానక తాను చరించి దుష్కృతో
పాయముచేత నే యితర భాగ్యముల్ హరియించి మంచిగా
తోయజనేత్రలన్ గలసి తుందుడు కొప్పఁగఁ గూడినంత నేఁ
ద్రోయక యుండునే యముఁడధోగతిలోపల వెంకటేశ్వరా॥ ౧౫

చ॥ సరగున మీనరూపమున సాగరమందునఁజొచ్చి సోమకా
సురునివధించి వేదములు సూక్ష్మగ వేధకునిచ్చి సద్యశో
భరణుఁడవైన చక్రధర భాస్కరగోత్ర రమాకళత్ర గా
వర నను దాసదాసుఁడను పంకజలోచన వెంకటేశ్వరా॥ ౧౬

ఉ॥ నీపదసేవ జీవనము నేరక మూర్ఖులు దుర్మదాంధులై
కాపురమందు మిక్కిలిఁగ కాంక్షవహించి యధర్మవృత్తిచే
పాపము లెన్నోఁజేసి యమబాధలచేత కృశింతుమంచు కా
సేపునునైన నిన్మదిని చింతనసేయరు వెంకటేశ్వరా॥ ౧౭

చ॥ యదుకులకీర్తిసాంద్రమ దయాకర శ్రీహరి సద్గుణేంద్ర నీ
రద సమకాయ భూవర సురావన ధీవర కావు వేగ సం
పదలనొసంగి సంతసముఁ బ్రస్తుతిఁ జేసెడివాఁడనంచు స
మ్మదమున వెంకటాచలప్రభూధర వాస్తవ వెంకటేశ్వరా॥ ౨౮

ఉ॥ రోసము లేనిబంటు యిసిరో బుధులెన్నని పండితార్థముల్
మీసలు లేని మూతియు సమీరుఁడు వీచనిరోజు మంచిఁగా
వాసన లేనిపువ్వు యరివర్గముకీఁగెటి లేని రాజ్యముల్
కాసుకునైన నివ్వి కొరగావు రమాపతి వెంకటేశ్వరా॥ ౨౯

ఉ॥ నచ్చియుపోవు రెండు నెరివచ్చియు పోకను రెండునుండు వే
హెచ్చుగ నేగియున్ మరల యిచ్చుటికిన్ నొగిరావు రెండు హా
తుచ్చుఁడు వీటిఁగానకను దోషపువృత్తుల నాచరించు మేల్
సచ్చరితుండుగాంచి మనసారనటించును వెంకటేశ్వరా॥ ౩౦

చ॥ ప్రియమును లేని భోజనము ప్రేమనటింపని కాంతసౌఖ్యముల్
నయమునుగాని యౌషధము నాట్యము సేయని వేశ్య గానముల్
దయగనన్నట్టి తల్లియు యథార్థముఁబల్కనివాని జన్మముల్
క్రియఁగని వ్రాయనట్టికపి కీర్తివహింపవు వెంకటేశ్వరా॥ ౩౧

ఉ॥ తోయము లేని నూతులును దోషముఁబాఁపనివేల్పు స్తోత్యమా
దాయము లేని వర్తకము ధర్మప్రవర్తన లేని గ్రామముల్
న్యాయమటంచు నెంచి నృపనాథుఁడుఁ జేయనిసీక్ష సద్బుధుల్
హేయమటండ్రు నివ్వినిరి హేతువలందగు వెంకటేశ్వరా॥ ౩౨

చ॥ చిలువలరేని తల్పసువిసేష దయామయ దీనకల్ప నా
తలను ధరించి నిక్కముగ తత్పదయుగ్మ సరోజముల్ సదాఁ

గాలచెద నీదయారసము గోటనుజిల్కి కృతార్థుఁజేయవే
బలరిపుపుత్రమిత్ర యరిభంజన సత్వర వెంకటేశ్వరా॥ ౩౩

ఉ॥ పొట్టిస్వరూపమెత్తి బలి పొంకముడంచి త్వదీయపాద సం
ఘట్టనచే రసాతలమె కాపురముండఁగ జేసి నాకముఁ
గట్టులవైరికిచ్చి మునుఁ గావఁగలేద రమామనోహరా
బట్టును సత్కవీంద్రుఁడను పాలనఁజేయుము వెంకటేశ్వరా॥ ౩౪

ఉ॥ ఎంతగ వేడినప్పటికి యించుకనైనను శ్రద్ధలేదు సు
స్వాంతభవామరాదినుత పావననామ యశోలలామ నా
వంతయుదీర్చి బ్రోవఁదగు వారిజలోచన వాదయానిధే
రంతులుయేల మున్ను యిభరాజును నేలవె వెంకటేశ్వరా॥ ౩౫

ఉ॥ కాసులులేని జన్మమును గానరసంబునులేని కంఠముఁ
గ్రాసములేనికొల్వు కొరగాని ప్రసంగముఁజూడ సంతతా
భ్యాసములేని విద్య కడుఁభక్తి నటించుచు నిత్యమంచి వి
శ్వాసములేని భార్య నిరసస్థితి గన్గొన వెంకటేశ్వరా॥ ౩౬

ఉ॥ దాసులులేని నాలయము దానములేని కరంబు మిక్కిలా
యాసముఁగల్గు భుక్తి కరుణారసముంచనివేల్పు మంచిగా
వేసములేనివేశ్య ప్రియవిందునుఁజేయని బంధుభావముఁ
యూసునులేని కయ్యమును యెన్నికకెక్కవు వెంకటేశ్వరా॥ ౩౭

ఉ॥ సంతునులేని గేము మనసార భజింపని నీదుభక్తి భూ
కాంతుఁడులేని రాజ్యమును గణ్యతకెక్కని యీవి సు
స్వాంతుఁడుఁగాని జన్మమును సాహితిలేని కవిత్వధార బల్
శాంతములేని మౌనిభలసారముఁగావివి వెంకటేశ్వరా॥ ౩౮

ఉ॥ దాతలులేనియూరు నృపదర్పము సేయని దేశతీరు బల్
నీతిని లేనివారు తనుణీమణిమెచ్చని భర్తసౌరు భూ
జాతము లేక గోరుసిరి చంద్రుడు లేని నిసీధి వ్యర్థమే
ధాతకుమారవంద్య గిరిధామ రమావర వెంకటేశ్వరా॥ ౩౯

చ॥ ముదిమిని గోరు పెండిలియు మూర్ఖుడు జేయు తపంబు రోగమధా
న్నదుడును లేనిరాత్రి వ్యవసాయము జేయని కర్షకుండు స
మ్మదముగభక్తియుక్తముగ మోహము జూపని భార్యముందు నా
పదలు ఘటించు సత్యమని బల్కుదు రార్యులు వెంకటేశ్వరా॥ ౪౦

ఉ॥ తల్లియుమాయ తండ్రియును దారసుతాదులుమాయ బంధువుల్
యల్లరుమాయ దేహమును యవ్వనమంతయుమాయ ద్రవ్యముల్
యిల్లును మాయటంచనక యెన్నిక సేయరు మూర్ఖచిత్తులుల్
పుల్లసరోజనేత్ర యదుపుంగవ తిర్పతి వెంకటేశ్వరా॥ ౪౧

ఉ॥ గొల్ల కులాంగనామణుల కోరిక లెల్లనుదీర్చి రుక్మిణీ
వల్లభ భక్తవత్సల కృపామతివంచును కీర్తిగాంచి రా
జెల్లదె నన్నుబ్రోచుటకు సేవితపాద మునీంద్ర వారమో
నల్లని వేల్పభూవర గుణాకర బాయక వెంకటేశ్వరా॥ ౪౨

ఉ॥ రార దయానిధే హరి నిరామయ కేశవ వాసుదేవ సం
సారభవాబ్దిలో నబడి స్వానుభవంబున తెలలేక ని
స్సారము జెంది భీతిలి నిజంబుగ యింతగ వేడుచుంటి నో
భూరిమయప్రచేల నను పోషణ జేయుము వెంకటేశ్వరా॥ ౪౩

ఉ॥ తోకల మూకలన్ గలసి తోయముపై నను రోడ్డు నిల్పి బల్
కేకలు బెట్టుచున్ రిపుల గీటణగించియు వేగ మైథిలిన్

చేకొని నీ వయోధ్యకును జేరినవాఁడవు నీవెగావ శు
శ్లోక బుధావనా పగరసోదరు నేలిన వెంకటేశ్వరా॥ ౪౪

ఉ॥ సిపును లేనివారు ధరణీవర సత్కవిలేన్కచీరు యా
చారములేని నోగిరము సాగరమందునునుండు రత్నముల్
నేరములేని దంపన తృణీకృతుకున్ దగ జేయుమేలు ని
స్సారము సారమాన హరిసాంద్ర యశోనిధి వెంకటేశ్వరా॥ ౪౫

ఉ॥ ప్రేమములేని భోజనము పెంపువహింపనివిద్య మంచిగా
నోమని సువ్రతంబు శిరుఃశోదయమందున నిద్రజూడ దు
స్సాముసమా తపోమహిమ స్వార్థకమేమి వృథాగణింప సూ
త్రాను సహోదరాఖిల విదారబుధావన వెంకటేశ్వరా॥ ౪౬

ఉ॥ సితియులేనివాని చెడుసీచునితోడను స్నేహమూని దు
ర్జాతులఁగల్సుకోని నగరానికిఁ జేర్చిన హానియంచు చే
జేతల దెచ్చుకుంటినని జెందడె దుఃఖము నిందమూర్ఖుడున్
ధాతకుమారవంద్య చరితాగిరినాలయ వెంకటేశ్వరా॥ ౪౭

చ॥ లవణము లేనిచారుయును లంచవిధంబగు విత్తమంత భూ
ధవులకు జారచోరులకు దండగ వృత్తులకెల్లమారు కేశవ
యననట్టి మూర్ఖజనజాలము దున్నలబారు వ్యర్థమా
శివనుతనామ హేమమయచేల సుధీవర వెంకటేశ్వరా॥ ౪౮

ఉ॥ ఆపగవచ్చు వ్యాఘ్రముల నంటగవచ్చు దవానకీలలన్
లేపగవచ్చు యద్రులను లెక్కను సేయగవచ్చు రిక్కలన్
కాపురవార్ధినీదుటను కష్టము యింతని జెప్పరాదు వో
తాపసవంద్య నన్ను బ్రోవు శుభధాకృతి వెంకటేశ్వరా॥ ౪౯

ఉ॥ గోపసమాన సద్విభవ గోకులపాల హరేముకుంద స
ర్వాపహ పాపదూర గిరిరాజకుమారినుతాంఘ్రియుగ్మ ని
ర్లేప నిరామయా రవికులేశ్వర చక్రధరాసురావనా
దాపురుఁ జేరినాఁడ ననుఁ ధన్యునిఁ జేయుము వెంకటేశ్వరా॥ ౧౦

ఉ॥ పాండునృపాలనందనుల భాగమునివ్వక వృష్టిఁబూని వే
దండపురాధినాయకుఁడు ధాత్రిసమగ్రము నాక్రమింప నీ
యండను జేరినంతటనె యద్భుతమైన దయార్ద్రదృష్టి యా
ఖండలసూతి నేలి పరికర్ములఁ గూల్చవె వెంకటేశ్వరా॥ ౧౧

చ॥ హరి బలశాలివయ్యు పొదయందున గూర్చొని యున్నదమ్ములున్
యిరువురుఁ బోరుచుండగను యించుకయైనను ధర్మమూనకన్
హరిసుతుపక్షమై కరమునందున వాడిశరంబుఁ బూని యా
హరిగణరాజునుగ్గడనుము హా యదిధర్మమె వెంకటేశ్వరా॥ ౧౨

చ॥ పగరసమూహకానన దవానల భూరిమయప్రచేల శ్రీ
ఖగకులనాధగామి హరిగానప్రవీణ బ్రబాకరాన్వయా
అగణిత సత్యభాష శరణాగతరక్ష వికుంఠమందిరా
నగసమధైర్యబ్రోవు సుగుణైక మురంధర వెంకటేశ్వరా॥ ౧౩

చ॥ కుతుకముమీర సూనములుఁ గూర్చినరీతిగ వృత్తజాతియౌ
శతకము నే రచించి మనుజన్మ నివృత్తినిఁ జేసెదంచు నే
హితవుగ నీదుకంఠమున కేను సమర్పణఁ జేసినాఁడ స
మ్మతిఁబడి నన్నుఁ బ్రోవదగు భానుకులేశ్వర వెంకటేశ్వరా॥ ౧౪

ఉ॥ వంటెకి బల్పుకీడు గుణవంతుఁడు దుర్జనుఁ జేరనీడు నా
ల్గంటికి రంకుకీడు వడిగాడ్పుకు యగ్నియుకీఁడుఁ జూడగా

పంటకు వానకీడుశల భంబు కదంబము పైరుకీడు నీ
కంటెను వేల్పులేఁడు ననుఁగావుము తిర్పతి వెంకటేశ్వరా॥ ౧౫

ఉ॥ అందని మ్రానిపండ్లు తనయాకటి కందని చేనిపంట మే
లొందని యూరనుంట మనసొగ్గని చేతిపడంతి వంట రా
కేందుడులేని రాత్రి యివి యెన్నిక కెక్కవు వ్యర్థమందురో
సుందరగాత్ర సద్విబుధ సూరిజనావన వెంకటేశ్వరా॥ ౧౬

ఉ॥ దాసుల దాసినంచు ననుఁ ధన్యునిఁ జేయను నీవెటంచు నే
వ్రాసితి నీమహత్తు సురవైభవ దిక్కుల నీదుకీర్తి స
ద్భాసురమై ప్రకాశమగు భానుకులేశ్వర వెంకటాద్రి స
ద్వాసవిలాస శ్రీశ కరుణారసమాధవ వెంకటేశ్వరా॥ ౧౭

ఉ॥ ఎవ్వని వేడుకొందు మఱియెవ్వని దూరుదు యేమనందు నే
నెవ్వరిచెంతఁ జేరుదును యెవ్వనకేగి విచారమొందెదన్
యెవ్వరు భూతజాలముల యేలెటివాడవు నీవెగాక వో
పువ్విలుకానితండ్రి నను పోషణ సేయుము వెంకటేశ్వరా॥ ౧౮

ఉ॥ కావుమటంచు నీదుపద కంజములన్ శిరసావహించి స
ద్దేవ మహానుభావ నిను దేహివిదేహుడవంచు వేడితిన్
చేవదలిర్ప మోక్షమును జెందగఁ జేయుము వో దయానిధే
భావభవస్వరూప భవబంధవిమోచన వెంకటేశ్వరా॥ ౧౯

చ॥ నుడుకుతనంబుచేత నిది ద్రోహమటంచని తెల్సికోక నే
కడువడిఁగాను కల్లలును గంపెడుఁగూసియు పొట్టకూటికై
పడితి ననేకపాట్లు యని భావమునందుననుంచకయ్య ఓ
పుడమికుమారికారమణ బ్రోవుము నన్నని వెంకటేశ్వరా॥ ౨౦

ఉ॥ తల్లివిదండ్రి సద్గురువు దాతవు దైవము నీవె యంచు నా
యుల్లమునందు నీదుపద యుగ్మములన్ నెరినిల్పి పూజనే
కొల్లగఁ జేసినాడను వికుంఠపురీవర గావవేమిరా
పుల్లసరోజనేత్ర యదుపుంగవ తిర్పతి వెంకటేశ్వరా॥ ౬౧

చ॥ బలి శిరమందు పాదమిడి పంతముతోడ రసాతలంబు నే
విలువగఁజేసి యింద్రునకు నేలుమటంచును స్వర్గమిచ్చి వే
ల్పుల యతిబాధలున్ నడచి పూర్ణముగాను సుకీర్తి గాంచితో
జలజదళాయతాక్ష వనజాసనవందిత వెంకటేశ్వరా॥ ౬౨

ఉ॥ పన్నగశేషతల్ప శశిభాస్కరనేత్ర బుధాళికల్ప యా
పన్నశరణ్య దీనజన బాంధవ శ్రీకర రాజశేఖరా
సన్నుతపాత్ర సచ్చరిత సాగరకన్య హృదాబ్జఖేల నీ
కన్న మహాత్ములెవ్వరిలఁ గావుము నార్తిని వెంకటేశ్వరా॥ ౬౩

చ॥ రుతుసమయంబునందు ననురూఢిగ మోహ మతిక్రమించియున్
సతిపతు లిర్వురున్ గలసి సఖ్యతతోడ రమింపనుక్రమున్
కుతుకము మీర శోణితముఁగూడియు నేర్పడు ముద్దరీతిగా
ప్రతిఫలియించి పిండము ద్విపక్షదినాలకు వెంకటేశ్వరా॥ ౬౪

చ॥ పదపడి రెండొమాసమున బాహుయుగంబులుగల్గి డొక్క మే
లొదువఁగ మూడొమాసమున రూఢిగ చాతురుమాసమందునన్
పదములు నుద్భవించి తుదిభాసుర మొప్పఁగ దాతువుల్ తగన్
కుదిరియు నైదునెల్లకును కూడియు మేనితో వెంకటేశ్వరా॥ ౬౫

చ॥ నెలకొని యారునెల్లకును నీచపుకర్మ శరీరమందు మే
లలవడునో యవంబులును నద్భుతమొప్పఁగ నంకురించియున్

సలలిత సప్తమాసమున స్వానుభవంబునుఁగూర్చినంత లో
పల కళలవమేర్పడఁగ పద్ధతియొప్పును వెంకటేశ్వరా॥ ౧౬

ఉ॥ అష్టమమాసమందు నను యాత్మగతంబుగ్రహించి పాపభూ
యిష్ట ప్రపంచమందు నను యేతెరబంపకుమయ్యఁజూడ వృ
త్త్యష్టపు గర్భగోళమున నుండుటకుఁ భరియింపఁజాల నీ
యిష్టము నా యదృష్టమును నెట్టులనుండునో వెంకటేశ్వరా॥ ౧౭

చ॥ అనినవమాసమందు కడు హాస్యత జెంది భరింపజాల న
న్ననుపుము భూతలంబునకుఁ హా జగదీశ్వర యన్యకాంతలన్
గనుఁగొని మోహమొంద ధనకాంక్షను జెంద నబద్ధమాడనే
నిను నుతియింతు సంతసము నీరజలోచన వెంకటేశ్వరా॥ ౧౮

చ॥ పదియవమాసమందు కరపద్మములన్ శ్రుతులావరించి మే
లొదవ ధరాతలంబున కధోముఖుడై జనుదెంచియంత బా
ల్యదశ నయన్నభంబగు మలంబున మున్గియు రోదనంబు చే
పడపడి నీదు సంస్మరణ ప్రార్థన జేయక వెంకటేశ్వరా॥ ౧౯

చ॥ మరచియు నిన్ను యంతటను మాధన దారసుతాదులందునన్
నిరతము ప్రాణవాయువులు నిల్పి ధనంబునుఁగూర్చి మోహసా
గరమునమున్గి తేలకను కర్మకు బద్ధనిబద్ధుడై సదా
నరకమునందుఁగూలెద రనాథలు తిర్పతి వెంకటేశ్వరా॥ ౨౦

ఉ॥ నీదయ చేత సాకు ధరణీధవ నీవును యెందుఁబోకుఁ దా
మోదర భక్తవర్గముల ప్రోవుము సేయకు బల్ల్పరాకు కా
కోదరతల్ప యింతగను కొంటుతనంబునుఁ బూనబోకు దు
ర్వాదమడనంచు యొంచకను వర్ధిలఁజేయుము వెంకటేశ్వరా॥ ౨౧

ఉ॥ మంకుతనంబుచేత కుసుమాయుధపంక్తికి తాళలేక యే
ణాంకముఖీమణీ స్తనభరాకృతినంటి నటించివేగనే
రంకుతనంబుఁజేసి చపరాతుదివిన్ను నుతింపలేక ఓ
వెంకటశైలవాస సుకవీస్తుత శ్రీశ్వర వెంకటేశ్వరా॥ ౭౨

చ॥ కరమునఁ దానకంఖణముఁ గట్టితి దీనబుధాళిదాసులన్
మురిపముతోడఁ బ్రోతువని భూరి సదాయశమందినాఁడవే
పరమముదంబునన్ న్నిగులఁ బ్రార్థనఁ జేసితినంచు నన్ను నీ
కరుణను నేలవేమి శుభగాత్ర సుధీవర వెంకటేశ్వరా॥ ౭౩

చ॥ ఎరుగక మూర్ఖచిత్తులును యించుకనీదు పదాబ్జయుగ్మమున్
సిరమునఁదాల్చి సుస్మరణఁ జేయగలేక వృధానసించి భా
స్కరసుతువీటికేగియు యసాధ్య దురస్థితిఁజెందరే తుదిన్
తిరుపతి వెంకటేశకడు దీనజనావన శ్రీసురేశ్వరా॥ ౭౪

చ॥ హరిహరినేత్రపూసీకృతమైన సుయజ్ఞఫలప్రదాయి భూ
ధరధర నాగతల్పవగదా శుభదాయక మంగళాంగ గా
వర సతతంబు నిన్నదిని భావుకమొప్ప నుతించినాఁడ సం
గర రిపునాశయీశ శివకార్ముకభంజన వెంకటేశ్వరా॥ ౭౫

చ॥ సరసిజనేత్ర నీదుపద సారసయుగ్మములందు చిత్తమున్
గురుతరమొప్ప నిల్పియు ముకుందమురారి ఖరాసురాంత భూ
ధరధరయంచు సంస్తుతి సదా ముదమొందుచుఁ జేసినాఁడ శ్రీ
కరగత దోషజాలమును ఖండనఁజేయుము వెంకటేశ్వరా॥ ౭౬

చ॥ ఖలరిపుమారశూర దశకంఠవిలుంఠన నిర్విచార భూ
లలన హృదబ్జసూర వరలాలితజన్య మహాప్రవీర శ్రీ

జలదసమానగాత్ర కలశాబ్ధివిహారగిరినివాస నా
తలపుననుండి సంతసము దర్శనమీగదె వెంకటేశ్వరా॥ ౭౭

చ॥ వరుసగ నిన్నుఁగాంచుటకు వచ్చినవారల రక్షచేతనే
సిరమునఁగొట్టి క్లేశములు సీఘ్రగతిన్ గోరిగించి నొష్టనే
తిరుమణిబెట్టిఁ బంపెదవు దేవుఁడవంచును నమ్మినందుకా
తిరుపతి వెంకటేశ శరధీసుతనాయక శ్రీసురేశ్వరా॥ ౭౮

చ॥ కవితయుక్లిష్టశబ్దములుఁ గాథశతరంబుగఁ గూర్చివ్రాయ స
త్కవియె నెరుంగునందుఁగల కష్టసుఖంబులు బిడ్డకుట్టు సం
భవమును వంధ్యకేమెరుక బాలుఁలగాంచిన శ్రీగ్రహించు మా
ధవ రిపువారశోష శుభదాకృతి బ్రోవర వెంకటేశ్వరా॥ ౭౯

చ॥ పొలుపుగ దేవసంఖమును పూర్వపు వేల్పులు మైత్రిచేతనేఁ
గలసియు మందరాద్రి నొక కవ్వముఁత్రాడు బిలేశుఁజేసి యా
కలశపయోధిఁజిల్కుటకు క్రమ్మర మిమ్ము నుతింప కూర్మమై
నిలచియొసంగవే సుధను నిర్జరజాతికి వెంకటేశ్వరా॥ ౮౦

చ॥ మరచియు నిన్ను యంతటను మాధవ దారసుతాదులందునన్
నిరతము ప్రాణవాయువులు నిల్పి ధనంబునుగూర్చి మోహసా
గరమున మున్గితేలకను కర్మకు బద్ధనిబద్ధినై సదా
నరకమునందుఁ గూలెద రనాథలఁ తిర్పతి వెంకటేశ్వరా॥ ౮౧

చ॥ పరధనమందునాశఁగొని పాట్టిసమూహము పోగుఁజేసి తా
యిటువురిమధ్య కక్షకడు యేర్పడఁజేసియు యాద్యకారియై
విరివిగ డబ్బుచేకొనియు వీలగునంత గ్రహించి మోసముఁ
జరిపి యనాగతస్థితి నిశాంకము యాగతవర్తమానమున్

ఏపగ కచ్చికష్టముల కెంతో కృపించి పరేతరాట్టుచే
పరిపరిరీతి నిన్నపుడు ప్రార్థనఁజేసిన యేమిసౌఖ్యమో
తిరుపతిశైలవాస విబుధేశ సురావన వెంకటేశ్వరా॥ ౧౨

చ॥ కరితురగంబులన్ ధనముఁగావలెనంచును గోరలేను నా
దురితములెల్లఁబోనణచి తోయజనేత్ర సదాముదంబునన్
స్థిరముగ మోక్షమార్గమును జెందెటిపీలును జూపెదంచు సం
బరముగఁ బ్రస్తుతించితిని మావర తిర్పతి వెంకటేశ్వరా॥ ౧3

చ॥ జలజభవామరాదులకు శక్యమె నీదు మహాత్మ్యమెన్న మే
లలవడనంచు శైలశిఖరాగ్రమునందు వసించి తౌభళా
తెలుపగ భక్తవర్గములు దాసుల దీనులచేత బాధలన్
దొలుఁగునటంచుఁ జేరితివ తోయజలోచన వెంకటేశ్వరా॥ ౧౪

చ॥ అగణితసత్యభాష శరణాగతరక్ష భవాబ్ధిశోష దే
వగణనుతాభిలాష కరివందిత సింహసమానరోష భూ
ఖగనచరాదిపోష నవకాంచననేత్ర దశప్రవేష యో
ఖగకులనాథవాహ హరిక్రమము నీవసు వెంకటేశ్వరా॥ ౧౫

ఉ॥ పండితరక్ష సూర్యకుల పావనపక్షి ముమోక్షదేవరా
ఖ్మాండనపక్షదైత్య గమినాశనదీక్ష రమాకళత్రి బ్రిం
హ్మాండము హ్యాదరా శరధిమందిరమాని పరోక్షదక్ష స
త్కుండలిరాజతల్పక నధోక్షరమాధిప వెంకటేశ్వరా॥ ౧౬

ఉ॥ జారుని చోరునిన్ఖలునిఁ సాడినిఁజెప్పెటి తాగ్రిగుఁబోతు నె
వ్వారలుఁ జేర్పరాదు మరి వారలతోడను కార్యమున్న తాఁ

చేరఁగరాఁదు వారియిలుఁజేరిన దుర్యశమబ్బుకుండు నె భూరి
వివేకుడైన నివిఁభూనరుఁజూడఁగ వెంకటేశ్వరా ౮౭

ఉ॥ తాపసవంద్యభూరమణ దానవురంధరనీలగాత్ర ని
ర్వ్యాపకపాపదూర దినరాజకులోద్భవలోకపాల శ్రీ
గోపసమాన సద్విభవకుండలిరాట్టు శయాన సత్కలా
లాపసుశీల బ్రోవునను యద్రిసురాగమ వెంకటేశ్వరా॥ ౮౮

ఉ॥ వేదవిచారపండిత కవీజనవందిత నిర్వికార పా
దోదధి భర్మసౌధ వసతోజ్వల రత్నకిరీట శూర దా
మోదర హీరహార సురభూరుహ శింహాయశోవిహార కా
కోదర భూషవంద్య ముచుకుంద రమాపతి వెంకటేశ్వరా॥ ౮౯

చ॥ విదురిని ద్రౌపదిన్ కరిని వేనుని భక్తకబీరున్ శుబా
స్వుడగు యంబరీషుని నిశాచరుబాలుడు యాదిగాను సు
హృదయులమాట్కి జన్మను నివృత్తి నిజేయుమటంచు నిన్ను స
మ్మదమున బ్రస్తుతించితిని పుణ్యచరిత్రుడవంచునిత్యమున్
మదనసహస్రకార రిపుమారణ తిర్పతివెంకటేశ్వరా॥ ౯౦

ఉ॥ జృంభణమొప్పగాను నరసింహస్వరూపముఁదాల్చి యుద్ధమా
రంభమునందు కశ్యపు నురంబునుజీల్చియు నల్లదావి యా
డింభకుఁగాచి వైరినివడిన్ పురిగొన్నటువంటి వాడవో
శంభునుతప్రభావ మురశాశన బ్రోవర వెంకటేశ్వరా॥ ౯౧

ఉ॥ విక్రమవంతులాదనుజవీరులుఁ గూడిఁ పరిమత్తుచేత ని
ర్వక్రపరాక్రమంబునను వేల్పుల మూకలబాధబెట్టు నీ

చక్రిము చేహరించితివి చాదృనిభాశ్యగమా మనోహరా
చక్రసురాదిసద్విబుధ జాలము నేలిన వెంకటేశ్వరా॥ ౯౨

ఉ॥ నిద్రను హారమించుకను నేనుమెరుంగకనిర్విచారినై
ముద్రిల చేత సంస్మరణమూలము చేతనుఁ బ్రస్తుతించితిఁ
యద్రికుమారికావినుత హా జగతీశ్వర నన్నుగావవే
భద్రగిరీనివాస భవభంధవిమోచన వెంకటేశ్వరా॥ ౯3

ఉ॥ మంధుడనయ్యినే నితరమార్గములెన్నిటిలోఁ చరించి గ
ర్వాంధముచేత దుష్కృతుల యన్ఛృతమొప్పగ జేసి కర్మ సం
బంధుడనైతి యింతటను పాలనఁజేయుము వేగనఁ జగ
ద్బంధుకులప్రదీప నినుఁదప్పక వేడెద వెంకటేశ్వరా॥ ౯౪

ఉ॥ అష్టమినాఁడుఁబుట్టి బుధులందరు సంతసమంద మాతులిఁ
దుష్టుడటంచుఁజంపితివి దోషమటంచని తెల్యలేక బల్
పుష్టిగపాలునిచ్చుటకు పూతకివచ్చిన దాని ప్రాణము
తృష్టముగానుతీసితివి కృష్ణ సుధర్మను వెంకటేశ్వరా॥ ౯౫

ఉ॥ మిత్రికులాబ్ధిచంద్రమ సమీరసఖాసఖ దేవదేవకీ
పుత్ర మహానుభావ హరిబాంధవ దీనదయానిధే సదా
పాత్రుడనయ్య నిన్ను బహుభంగుల వేడినగావవేమి స
ద్గోత్రరమా విభోవరద గోపరిపాలన వెంకటేశ్వరా॥ ౯౬

ఉ॥ వందలువేలుపద్యములు వర్ణనఁజేసియు నీదుపేర ఓ
నందకుమారవ్రాసితిని నాగహరాగమనాహరీశతా
నందపురందరాదిసుర నారదవందిత గానలోల దు
ష్పందుడటంచు నెంచకను పాలనజేయుము వెంకటేశ్వరా॥ ౯౭

ఉ॥ మూఁటినిఁ దాటలేక నెరిమూఁటిగుణంబులు తెల్యలేక ము
మ్మూఁటికిమూటియందుగల ప్రాకృతవైరమునందుఁజిక్కి నా
సాటెవరంచు హంకృతినిజంబుగఁ బొందియు నిన్నుఁ గానకన్
కాటికిఁ బోవు కేలయని గానరుమూర్ఖులు వెంకటేశ్వరా॥ ౯౮

చ॥ తరియిదె నన్ను బ్రోచుటకు దైవమటంచును నిన్ను నమ్మి నే
మరువక నీపదాబ్జములు మక్కువతోఁడను పూజఁజేతు లే
కరనిడి నీమనంబునను యన్యునిగా నిరసించి తేసి నీ
పరువుకు సుప్రతిష్టకును భంగముఁగల్గును వెంకటేశ్వరా॥ ౯౯

ఉ॥ కుంకులకుంటవాసుడను కోవిదమిత్రుఁడ రాళ్లబండి రా
మాంకిత నామకుండను సుమా ననుఁగావకయున్న భట్టు నే
వంకలనైన దూరుదును వాస్తవమియ్యది యాచు నమ్ముమో
వెంకటశైలవాస సుకవీస్తుత బాంధవ వెంకటేశ్వరా॥ ౧౦౦

చ॥ చదువగలేను కావ్యములు సారయుతంబుగ లక్షణంబు నే
చదువగలేను వ్యాకరణసంధులు శబ్దములన్ నిఘంటులన్
చదువగలేను నీదు పదసారసయుగ్మము లే స్మరించి మే
లౌను ప్రవటంచు వృత్తములు వొప్పుగ వ్రాసితి వెంకటేశ్వరా॥ ౧౦౧

సంపూర్ణము

